# సింహళద్వీపచరిత్రము

(ఆంధ్రవిజ్ఞానానుబంధము)

ప్రసాదభూపాలుఁడు





జ్ఞానోదయము

రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్,
రాజమహేంద్రవరము.

సర్వస్వామ్య సంకలితము    వెల. రు. 0—8—0

1940.

# విజ్ఞప్తి.

విజ్ఞానవాంఛ యెల్లరకు సర్వసాధారణమైన యీకాలమున దేశచరిత్రలు మొదలగునవి అత్యావశ్యకము లని వేఱుగఁ దెల్ప నక్కఱయుండదు. అం దన్ని వివరణములు చక్కఁగఁ దెల్పెడి గ్రంథము లాంధ్రదేశమునందు మిక్కిలి యరుదు. ఆంధ్రవిజ్ఞానము వ్రాయుటయందు మాకు లభించిన దేశచరిత్రములు, వివరణములు, చూడఁదగిన తావులు మొదలగునవి పెక్కులు సంభవించుటచేనే యొక చోటఁ జేర్చుచు నీ సింహళద్వీప చరిత్రము వ్రాసి ముగింపఁ బడినది. కావున నాంధ్రవిజ్ఞానానుబంధ గ్రంథముగఁ బేర్కొనఁ బడినది. ఆంధ్రదేశమిట్టి గ్రంథముల నామోదించి చదివినచో దానినే మాకొసంగిన ప్రోత్సాహముగాఁ గైకొని మున్ముం దిట్టి గ్రంథములు పెక్కులు ప్రకటింప ప్రయత్నింతుము. ఆంధ్రమహాజనులు మా నిజాభిప్రాయము నరయుదురుగాక !

ఇట్లు,
బుధవిధేయుఁడు,
కం. బాలసూర్యప్రసాదరావు,
గ్రంథకర్త.

రాజమహేంద్రవరము,
29—1—40.

# సింహళద్వీపము.

## (లంకారాజ్యము.)

ఇది ప్రయాణముల కాలము. వాణిజ్యవ్యాపారములకొఱకో విజ్ఞానవాంఛాపీడితులై దేశాటన మొనర్చుకొఱకో యభివృద్ధి కాంక్షించు ప్రతి యాంధ్రుఁడును దేశములు తిరుగుచు నరయు చుంట సహజము. అందు భరతదేశపు దక్షిణభాగమున హిందూ మహాసముద్రమునం దున్న సింహళద్వీపమునుగూర్చి యెఱుఁగ కుంట హేయము. పెక్కు రేవులనుండి సింహళమునఁ బ్రధాననగరమగు కొలంబో రేవున కరుగ నగును. ఆంధ్రులకన్నచో దక్షిణఇండియా యినుపదారి ప్రధానమార్గము. చెన్నపురినుండి సౌతిండియను రెయిల్వే చిన్నలైనుబండ్లు ధనుష్కోటి కరుగుట యెల్ల రెఱింగినదే. తిరుచనాపల్లిసంధిమీఁదుగా వెత్తైల్ మంటపముకడనుండి సముద్రమునఁ బెద్దఱాళ్ళపై నిర్మింపఁబడిన ఱాతిదిమ్మలయినుపవంతెనపైఁ బర్విడి రామేశ్వరద్వీపము (లేక కొందఱు వాడునట్లు పాంబన్ ద్వీపము)నందలి పాంబనుసంధికిఁ జేరనగుచున్నది. ఇటనుండియే రామేశ్వరమునకరుగు యాత్రికులు వేఱులైనుపై నేగుదురు. పిదప చెన్నపురినుండి యరుదెంచినబండ్లటకుఁ బదునాఱుమైళ్ళ దూర మందున్న ధనుష్కోటి కరిగెడిని. అటనుండి త్వరితగమన మొనర్చు నోడయం దెక్కి రెండుగంటల యిరువదిమినిట్ల కాలములో పాంబఁ న్పేసేజి యనంబడు నాసముద్రపుపాయఁ గడచి మన్నారుద్వీపము నందలి తలమన్నారునకుఁ జేరనగును. మన్నారుద్వీపము లంకా రాజ్యమునకుఁ జెందినదియే. అటనుండి సిలన్ గవర్నమెంటు రెయిల్వే బండ్లపైఁ బయన మొనర్చుచు పది లేక పండ్రెండుగంటలలో కొలంబోనగరమునకుఁ జేరనగుచున్నది.

ఈ సింహళద్వీపమున వాడుకయం దుండి చెల్లుచున్న ప్రభుత్వముద్రితమైన నాణెములను వివరించి ముందునకుఁ జననగును. రూపాయ భరతదేశపురూప్యమునుబోలినదియే. అందు నూఱు సెంట్లు లెక్కింపఁబడియున్నవి. ఇంకను ఏఁబదిసెంట్లు (Cents) అర్ధరూపాయయు, ఇరువదియైదు సెంట్లు పాతికరూపాయయు, పది సెంట్లు దశాంశరూప్యమును వెండినాణెములుగ వాడుకయం దున్నవి. ఐదుసెంట్ల నికెల్ నాణెమును, ఒకసెంటు రాగినాణెమును గలవు. బ్రిటీషిండియారూపాయ సింహళమునఁ జెల్లుటకు శాసనాధికారము కల దందురు. అది యేమియోగాని సింహళరూప్యములు దేశమునం దంతగా వాడుకయందుఁ గానరావు. కాకితపు నోట్లు (పేపరుకరెన్సీ) సింహళమునం దెక్కువగా వాడుకయం దుంట గాననగును. బ్యాంకులు, ట్రెజరీలు, షూరకపువర్తకులు, నాణెములను మార్పువర్తకమును బాగుగనే యున్నది. సింహళద్వీపమునకును, భరతదేశమునకును గొంత వర్తకసంబంధము కలదు. ప్రజల రాకపోక లధికముగా నుంటయేగాక భరతదేశపు స్వామ్రాజ్యమువలెనే సింహళమును బ్రిటీషువారి యధికారమునం దుంట యంతగాఁ దెలియరాకున్నను ఇందొకటి యన్యులహస్తగతమగునేని రాజకీయముగఁ గొంతయొత్తిడి కల్గుచుండెడిని. ఇట్లనుటయం దుభయదేశములవారికి నన్యోన్యబాధ్యత లుండవలయునని మా యభిప్రాయము.

## దేశపరిస్థితులు.

### తెలియఁదగిన కొన్నిసంగతులు.

పాశ్చాత్య భూగోళశాస్త్రవిదులు దీనిని Pearl shaped Island అనియు, భరతదేశపుదక్షిణదిశ నొక Pearl Drop వలె నున్న ద్వీప మనియు వర్ణించియున్నారు. ఆంగ్లభూగోళశాస్త్రపు

లెక్క మేరకు North latitude ఐదుడిగ్రీల యేఁబదియైదుమినిట్ల ప్రదేశమునకును, తొమ్మిదిడిగ్రీల యేఁబదిమినిట్ల ప్రదేశమునకును నడుమగా East longitude ఎనుబదియొకడిగ్రీల యేఁబదిమూఁడు మినిట్ల ప్రదేశమునం దున్న ద్వీపము. దీనియొక్క ఉత్తరదక్షిణ ములకొలత అనఁగా నుత్తరమున పోయింటుపాల్మైరానుండి దక్షిణమున దొందాహెడ్డుదనుక ౨౭౦ మైళ్లును, ద్వీపము యొక్క తూర్పుకడను సంగమండ యనంబడుతావునుండి పశ్చిమ మున కొలంబోనగరమునకు ౧౪౦ మైళ్లును గలిగి ద్వీపము ౨౫౩౩౨ చతురపుమైళ్లు వైశాల్యమని లెక్కింపఁబడియున్నది. ఈపరిమాణ మించుమించు ఇంగ్లాండుదేశపు పరిమాణమున సగముగనుండు నఁట. పర్వతమయప్రదేశములం దక్క తక్కిన తావు లన్నియు సమతలముగనే చెప్పఁబడినవి. దక్షిణార్ధమున నడుమగ పర్వతప్రదేశముగ నున్నది. ద్వీపవు పశ్చిమతీరభాగ ముత్తరమున పుత్తాలమునుండి దక్షిణమున మతారాదనుకఁగల ప్రదేశము వ్యవసాయపుభూము లనియే చెప్పవలయును. కొన్ని పల్లపుఁబ్రదేశము లరణ్యములుగ నున్నను, నడుమనడుమ వీలగు తావులందు పూర్వపు సింహళభూపతులచే నిర్మింపఁబడిన కృతక సాగరములు, వాటిక్రింద పండు వరిపొలములును గలవు. నీటివసతి గల తావులందు గొండలలోఁ గొండలప్రక్కభాగములు, లోవలు మొదలగుతావుల ధాన్యపుపంట కలదు.

కొంతధాన్యము హెచ్చుధర కమ్ముడుపోవుచుండు నందురు. మైసూరునుండి అమృతమహల్ జాతి యాఁబోతులను దెప్పించి సింహళమున నొక చక్కనిజాతి పశువులను స్వదేశపు టావులందుఁ గల్గించుచున్నారు. ఆయెద్దును,దున్నలును వ్యవసాయపుఁబశువులుగ నున్నవి. ఎక్కువ పాలిచ్చు నావులు సింహళమునఁ గానరావు.

## సింహళద్వీపము.

సింహళద్వీపమునఁ జక్కని బాటలు విరివిగనే కలవని తెలిసె డిని. యాత్రికులవసతి కించుమిం చన్ని తావులందునను మకాం బంగాళాలు కలవు. దేశ మంతటను మోటార్లు, రిక్షాబండ్లు, ఎడ్లబండ్లు ప్రయాణసాధనములుగ నున్నవి. అడవులందు టేకు, గనరు, ఇరుగడిచేవ, చేవతాడి కలపలు కలవు. పనసచెట్లకలప యెక్కువ వన్నె నిచ్చునది గాన కఱ్ఱసామానుల కుపయోగింపఁ బడుచున్నది. ఈద్వీపమున సింహములు, పులులు గానరావు. చిఱుతపులులు, ఎలుఁగుబంట్లు, తోడేళ్ళు మొదలగుకొన్ని యడవిజంతువులు కలవు. ఏనుఁగు లడవులం దధికముగ నున్నవి. అవి నిర్దంతులు అనఁగా దంతము లుండనివి. వాటిని బట్టుట కొందఱకు వృత్తిగ నున్నది.

భూమధ్యరేఖకుఁ గడుసమీపముననుంట నీసింహళద్వీపము వేఁడిప్రదేశముగనే చెప్పఁబడినది. మన్యపుజ్వరముల బాధ యంతగాఁ నిందుఁ గానరాదు. మార్చినెలనుండి మే నెలదనుక నుష్ణకాలముగను, డిశంబరునెలనుండి ఫిబ్రేవరిదనుక చల్లనికాలముగను, పశ్చిమతీరముల జూలై, ఆగష్టు నెలలు సౌఖ్యమగు కాలముగనుఁ గొందఱు చెప్పుచున్నను సగటున వేఁడి యధిక మనియే చెప్ప నయ్యెడిని. ప్రభుత్వమువారినిర్ణయముమేర ఉత్తరభాగమున తూర్పుభాగమునఁ గల ప్రదేశములు 'Hot and dry' అనియు, దక్షిణపశ్చిమ భాగముల ప్రదేశములు 'Hot and moist' అనియు, మధ్యభాగమున 'Cold and moist' అనియు వివరింపఁ బడియున్నవి. సింహళదేశస్థులు సంవత్సరమున రెండుకాలము లనెదరు. వీటికి మాన్సూనులు (monsoons) అనెదరు. అర్ధసంవత్సరకాల మీశాన్యదిశనుండియు, అర్ధసంవత్సరకాలము నైరృతిదిశనుండియు గాలులు వీచుచుండును. వీటిమార్పులందు బలమగు వర్షములు కురియుచుండును. కావున నేటేట రెండు వర్షాకాలములని

చెప్పఁబడినది. వర్షారంభకాలమునఁ గొన్ని దినములు వేఁడి, ఉక్క అధికముగ నుండి ఆకసమున నల్లనిమేఘములు దట్టమగుచుంటయుఁ గన్పించు చిహ్నము లఁట. పిల్లవాయువులవలెఁ బ్రారంభ మగుటయు రానురాను బలపడి ప్రచండవాయువులుగవీచి పెద్దధ్వనితో ప్రళయమువలె జడివాన కురియుటతో గాలిపాటు మాఱుచుండును. ఇట్టికటి పెక్కువృక్షములు నేలఁ గూలుటయు, వాలిపోవుటయు, వంకర లగుటయు సంభవించుచుండును. కొబ్బరితోఁటలందీచికాఱకలు స్పష్టమై కన్పట్టెడిని. ప్రతి కొబ్బరిచెట్టును కొద్దిగనో, గొప్పగనో వంకరలుకల్గియేయుంట సీద్వీపవాసులందు "వంకరలేని కొబ్బరిచెట్టును, చచ్చినకోఁతిని, తెల్లనికాకినిఁ జూచినవా రుండ" రని సామెత యేర్పడినది.

సింహళద్వీపముజుట్టు సముద్రమున పోటుపాటులు గానరావు. ద్వీపపు దక్షిణతీరములందు ఆఱునెలలదనుక పశ్చిమమునకును, ఆఱునెలలు తూర్పునకును గడుబలముగ సముద్రజలప్రవాహములు (Ocean currents) సముద్రమునఁ బ్రవహించుచుండును. పూర్వకాలమునం దొకయోడ కడుదూరమునుండి గాలీరేవున కరుదెంచుచు రేవునెదుటనే దారితప్పి ఓషనక్కరెంటునఁ దగుల్గొని మూఁడువారములకాలము ముందువెన్కలకుఁ దిరుగుచు రెండుసారులు భూమధ్యరేఖను(Equator)దాఁటి యెట్టకేలకుఁ గష్టముగ గాలీరేవునఁ జేరినకథ నతిరమ్యముగ నిచటివారు తెల్పెదరు.

ఈద్వీపమున సూర్యాస్తమయములు చూడఁదగియుండును. సాయంకాలమునకు పశ్చిమదిశ రంగులమయ మగును. తఱచుగ బుద్ధకిరణము లగపడుచుండెడిని. సూర్యబింబ మస్తమించి క్రుంకగనే యత్తావునుండి నీలిరంగుగనుండు నాకాశమున నొకవిసనకఱ్ఱవిప్పినట్లు కిరణధాతువులు ప్రారంభమున సన్నముగనుండియాకసమునపైదిశకు

బోనుపోను వెడలుపుగనగుచు విప్పినజపానువిసనకఱ్ఱయాకారమున వ్యాపించి కాన్పించుచుండువాటి నీదేశమున బౌద్ధులగు సింహాళులు బుద్ధకిరణము లందురు. ఈద్వీపమున గాలియందు ధూళి లేనికారణమున వెన్నెల రాత్రులం దతితేజోవంతమై కన్పట్టుచుండెడిని.

సింహాళమున శ్రీతాళము లనంబడు తాటిచెట్లచ్చటచ్చటఁ గాననగుచుండెడిని. వాటియాకులు చాలపెద్దవిగ నుండును. చాల వెడలుపైనవి. పూర్వపు తాటియాకులగ్రంథములు వీటిపై వ్రాయఁబడుచుండునవి. అట్టి వనేకము లీదేశపుఁబుస్తక భాండాగారములఁ గలవు. శ్రీతాళమును సింహాళభాషయందు తాలీపాట్ అందురు.

## పరిస్థితులు - మనుష్యులు.

సింహాళద్వీపమున ౧౯౩౧ ఫిబ్రవరినెల ౧౬ తేదీ జనాభా మేరకు ౩౨౬౭౪౫౭ మంది బౌద్ధమతస్థులును, ౧౧౫౯౫౨౨ హిందువులును, ౫౨౩౦౬౬ క్రైస్తవులును, ౩౫౬౯౯౯ మహమ్మదీయులును, ౮౩౯ ఇతరమతములవారును, మొత్తము ౫౩౦౬౯౭౧ జనులు వసించుచున్నా రని తెలియుచున్నది. ఈలెక్క మేరకు చౌకపు మైలుపరిదేశమున ౨౧౦ మంది వసించుచున్నట్లు తేలుచున్నది. కావున జనసమ్మర్దముకల దేశమనియే చెప్పఁదగును. ఇందు మూరుమహమ్మదీయులు ౩౨౫౮౧౩, మలయను మహమ్మదీయులు ౧౫౯౭౭ కలరని లెక్కింపఁబడిరి. క్రైస్తవులందు సిలనీస్ అనఁబరగు బర్ఘరులు ౩౨౩౧౫ మంది కలరు. సింహాళులు సింహాళభాషను, అఱవ లఱవభాషను, బర్ఘరులు పోర్చుగీసుభాషను మాతృభాషగ మాట్లాడుదురు. ద్వీపముయొక్క మధ్యభాగమునను, దక్షిణమునను, పశ్చిమమునను ముఖ్యముగ వసించువారు సింహాళులు. అఱవ లుత్తరమునను, తూర్పునను నధికముగ వసించు

చున్నారు. తేయాకు మొదలగు తోఁటలకూలీ లఱవలే గాన నఱవమునే మాట్లాడుచున్నారు. ఇంగ్లీషు, అఱవము సర్వసాధారణముగ వ్యాపించియున్నదనియే తోఁచెడిని.

క్రైస్తవులలోఁ చేఁపలనుబట్టి యమ్ముపల్లెకులన్షు లధికము. వీరు రోమన్కాతలిక్కులు. వీరు ద్వీపమునుజుట్టి సముద్రతీరముల నధికముగ నుందురు. ద్వీపపు టుత్తరభాగపు కడదీవులందీ తెగవారెక్కువగ నుంటయేగాక యట వారికి యాత్రాస్థలములుగనున్న క్రైస్తవదేవాలయములును గలవు. వీరందఱును రోమన్కాతలిక్కుక్రైస్తవులు. మూఢపునమ్మకములు వీరి కధికము. ద్వీపవాసులు చేఁపల నధికముగఁ దినువారే గాన వీరివృత్తి బాగుగనేయున్నది.

సింహళద్వీపరాజ్యమునకుఁ జెంది కొన్ని ద్వీపసముదాయములును గలవు. మన్నారుద్వీపమును, దానియొక్క యుత్తరపుకొనదనుక ధనుష్కోటినుండి యచ్చటచ్చట వరుసగ నగపడు చిన్న చిన్నద్వీపములవరుసయును నట్టివియే. ఈవరుసనే శ్రీరామసేతువందురు. ఆంగ్లేయులు క్రైస్తవులు గాన Adam's bridge (ఏడమ్సుబ్రిడ్జి) యనెదరు. మఱియు నాసముద్రతీరమును Adam's beach (ఏడమ్సుబీచ్) అనుచున్నారు.

దేశపుఁబ్రజలలో సింహళు లధికసంఖ్యాకులు. వారు విజయుఁడను రాకొమరునితో గంగాతీరమునుండి యీద్వీపమునకరుదెంచి దాని నాక్రమించినవారు. వారిపాలననాఁటి జెండా (ధ్వజము)పై సింహము లాంఛనముగనుండుట నన్యులు వారిని సింహళు లనివాడిరి. అదియే వారికిఁ గులనామమైనదఁట. యుద్ధవీరుల కుండు పౌరుషాదిగుణములు తగ్గి కర్షకులుగను, తేయాకు, రబ్బరుతోఁటల నాటువారుగను నున్నారు. కొందఱు వీరిని దావాతగాదాలలో నారిందా లనియు, న్యాయస్థానవ్యాజ్యప్రియు లనియు

నందురు. తరువాతఁ జెప్పఁదగినవా రజవలు: ఎక్కువ నేర్పరు లని పేరందినవారు. వీరియందు జాతిభేదములు కలవు. అవి దక్షిణ ఇండియా దేశమునందువలెనే యుండును. వీరిముఖ్యవృత్తి వ్యవసాయము. పొగాకు, ధాన్యములు చక్కఁగాఁ బండించు నేర్పరులు. వీరివిద్యాధికులు వీరివిద్యాధికుల గుమాస్తాలుగఁ గుదురుట కలదు. కొందఱు సింహళపుఁదమ్మిళులందు ఫోర్జరీ (సృష్టివిద్య)యం దెక్కువ నిపుణతగలవా రుండు రందురు.

సింహళమున మహమ్మదీయులు మూరుజాతి (మూర్సు) వా రనియు, మలయనుజాతివా రనియు నిఱుతెగలుగ నున్నారు. మూరు లాదిని అరబ్బీలుగ నుండిరి. కాని మొరాకో దేశస్థులు కారఁట. ఆదికాలమున మహమ్మదు గురుం డిస్లాం మతస్థాపన మొనర్చుచున్న నాఁటినుండియు నీద్వీపమునకు వలసవచ్చుచునేయుం డిరఁట. వీ రిక్కాలమున 3౨౫౯౧3 మంది కలరని సింహళ జనాభాలెక్కలనుండి తెలియుచున్నది. వీరు వర్తకులుగను, చేతి పనులఁ జేయునేర్పరులుగను గానవచ్చుచున్నారు. ముత్యాలసలాప ముండిన కాలములందు సముద్రమున మున్గి ముత్యపుచిప్పలు, శంఖములు, వివిధరంగుల వింతవింతగుల్లలనుఁ బట్టుటయందు నేర్పరులుగఁ బశ్చిమోత్తర భాగములందుఁ గానవచ్చుదురు. రత్నపుర ప్రాంతమునందు రత్నములను సానపట్టువారిలో వీరును మలయను జాతివారితోఁ గలసి పనిచేయుచుందురు. వీరి నన్యులగుసింహళులు తమిళులు, 'కాకా' యనుజాతినామముతో వీరినిఁ బిలిచెదరు. (కాకా యనిన కాకి కర్థమఁట.) ఇంక నాంగ్లేయులు వారినిఁజూచి యితరులగు నైరోపియనులు వీరివేషభాషల నవలంబించిన బర్ఘరులు (సిలనీస్) వీరిని తంబి యని పిలిచెదరు. తంబి యనిన తమ్ముఁడని యర్థ మఁట.

తక్కిన నులయనుజాతి మహమ్మదీయు లాదిని సైనికులుగ నుండిన మహమ్మదీయుల సంతతివార మందురు. వారు మూరుల వలె వర్తకములయం దారిందాలు కాకున్నను చేతిపనులయందు వారివలెనే మెలంగుచుందురు. రత్నపురిసీమయందు రత్నములను సానపట్టువారుగను, ముత్యాలసలాపమున సీటమున్గి గుల్లలను బట్టి తీయువారుగను వీరు కాన నగుచుందురు.

బర్ఘరులు తొల్లింట డచ్చివారికిని పోర్చుగీసువారికిని స్వదేశ స్త్రీలయందుఁ గల్గిన యూరేషియనులు. వీరు క్రైస్తవులు. పోర్చు గీసుభాషను గొంత ఆంగ్ల, అఱవ, సింహళభాషాపదముల కల్తీతో స్వభాషగా మాట్లాడుచున్నారు. ఐరోపా దేశస్థులవలె వేషభాషలు కలవారు. వీరియందుఁ బెక్కండ్రు న్యాయవాదులుగను, డాక్టర్లుగను, వైద్యులుగను, నుద్యోగులుగను, కలక్టరులుగను, జడ్జీలుగను నుంట నీతెగ కొంతవఱ కధికారమూర్తు లనియే చెప్పఁదగును. స్వల్ప సంఖ్యాకుల య్యుఁ దమ్మను సింహళీస్ అనిపిలువ వాంఛించువారుగ నున్నారు. ఇంక నాంగ్లేయు లేపదవియం దున్నను, నేవృత్తియం దున్నను సింహళమున నధికారమూర్తులే. ఐరోపావా రగు నితర దేశస్థులు వర్తకులుగ నున్నారు.

ఈ యధ్యాయమును ముగింపక మున్ను ద్వీపమున నాదిమ నివాసులుగఁ జెప్పఁబడు వెడ్డాజాతివారినిగూర్చి యించుక వివరిం చుట సమంజసము. వీరి కింతకుఁబూర్వము యాక్కో లని పేరుండె నందురు. వెడ్డాశబ్దము వర్ధశబ్దపువికారరూపము. "తక్షాతువర్ధకిః" అనఁగా తొల్లింటి విశ్వకర్మసంతతి యనియర్థ మగుచున్నది. తక్కిన యాక్కోశబ్దము యక్షశబ్దపువికృతి యనితోఁచెడిని. లేక యిదిరక్షశ్శబ్ద ముతో నేపాటిసంబంధముకలదో పరిశీలన జరుగవలసియున్నది. తెలుఁగువారిలోని జక్కులీయాక్కోలతో వృత్తికళలలో సమాన

లక్షణములు కలవారని కొందఱు పరిశీలకు లనెదరు. ఐరోపా దేశపుఁ బరిశీలకులు యాకోక్కలు మధ్యరాష్ట్రములందలి గోండు జాతినిబోలి యున్నివిధముల నున్నవారని పోల్చుచున్నారు. ఏది నిజమైనను వెడ్డాలు తొల్లింటి లంకారాజ్యపురాక్షసులకు స్వదేశ స్త్రీలయందు జనించినవారని బలమగు వాడుక కలదు. సింహళుల మూలపురుషుఁడగు విజయభూపతి వెడ్డాలబాలను బరిణయమాడె నని చెప్పఁబడినది. శివకుమారుఁడగు కుమారస్వామి పరిణయమైన వల్లీదేవి వెడ్డాలబాలిక యని వారియందు బలమైన నమ్మకము నేఁటికిని గలదు. వెడ్డాలు స్వల్పసంఖ్యాకులు. పార్కుకంట్రీ యనఁ బరఁగు కొండలలో గుహాలు మొదలగువాటియందు వసింతురు. వేఁటాడి మృగములమాంసమును, తేనెను, గొన్నిపండ్లజాతులను నాహారముగ భుజింతురు. ధనుర్బాణములఁ జేతితోను, గొందఱు పెద్దబాణములను వెల్లకిలఁ బరుండి కాలుసేతులతోను గూడ వదలుదురు. ఇతరులు తమ్ముఁ జూడనొల్లక దాఁగియుండెదరు. వర్తకముసల్పినను నిల్లే చాటుననే యుందురు. ఇతరజాతులు వీరిని పూజ్యులుగ నెంచి వీరికిఁ బిల్లల నిత్తురు. కాని వీరిపిల్లల నన్యుల కీయ నిచ్ఛగింపరు. వీరిమతమునుగూర్చి సరిగాఁ దెలియరాకున్నది.

చేఁపలవాండ్రగు రోమనుకాతలిక్కు క్రైస్తవులలో నొక గట్టి మూఢనమ్మకము కలదు. చేఁపలను బట్టు వలలను తెగఁగోయుట మహాదోష మని వారినమ్మకము. తన్నుఁ జంపవచ్చిన వైరి యొక్క చేఁపలవలయైనను నెంత యసాక్షికముగ తనకు దొరికినను, దానినిఁ గోసి పాడుచేయకుందువారు. అట్లు ఒట్టుకూడఁ బెట్టుకొను వాడుక వారియందుఁ గలదఁట.

సింహళమున నిన్నిజాతులు, మతములు నున్నను నందఱు నైకమత్యముతో మెలంగుదురు. వీరియందు దృష్టిదోషము లేదు.

ఐనను భోజనప్రతిభోజనములు సంబంధబాంధవ్యములు నన్యులతోఁ జేయరు. బౌద్ధులును, హిందువులును మహావేలిగంగ, కాలూగంగ మొదలగుపుణ్యనదీజలములందునను, పవిత్రతీర్థములుగలచెఱువులు, నూతులు, ధారలు మొదలగు స్నానతీర్థములందునను గలసిమెలసి యుండుట కాన నయ్యెడిని. మతావేశపరులగు మూరుమహమ్మదీయు లాదికాలమున నీద్వీపమున దిగినతావులం దనంగా సముద్రమున నోడ దిగినతావులందే వారిదేవాలయములగు మసీదులు కట్టుచుండిరంట. ఇట్టివి కేవలమును సముద్రపుటొడ్డుననే యుంట నోడలనుండి చూచువారలకు దూరమునకుఁగూడఁ గాన్పించుచుంటయు, వాట్లయందు నమాజొనర్పుటకూడ నోడలనుండి చూడఁదగియుండును. అట్టివి బెరువాలా యనఁబడుతావున నొకమసీదు సముద్రములోనికిఁ జొచ్చుకొనియున్న భూభాగపు శిలాతలమునఁ గట్టఁబడియున్నది. సముద్రములోనికిఁ జాలదూరము కన్పించుటయే కాక యిచట మువుద్దీ నొనర్చెడి అల్లాహూఅక్బరు కేక యొకొక్కక తఱి నోడలోనికిఁగూడ వినిపించెడిని. మెగ్గోనా యనఁబరఁగు వేఱొకతావున మసీదుకడనుండియే యినుపబాట వేయఁబడినది. ఇట రైలుబండ్లనుండియే నమాజు కాన్పించెడిని.

## పరిస్థితులు - భూములు - తోఁటలు

ఇంక నీద్వీపపు భూపరిస్థితులు వివరింతుముగాక. సగటున పదునొకండులక్షలయకరములు కొబ్బరితోఁటలక్రిందను, ఎన్మిది లక్షల యేఁబదివేలయకరములు వరిపంటక్రిందను, ఆఱులక్షల యిరువదియెన్మిదివేల యాఱువందల యఱువదియాఱుయకరములు రబ్బరు తోఁటలక్రిందను, ఐదులక్షల యేఁబదియేడువేల రెండువందల యెనుబదినాల్గుయకరములు తేయాకుతోఁటలక్రిందను, ఒకలక్ష

నలుబదివేలయకరముల ప్రదేశము సెనగలు మొదలగు నపరదినుసుల పంటక్రిందను భూమి యున్నట్లు ప్రకటింపఁబడిన లెక్కలనుండి తేలుచున్నది. ఇవిగాక యింకను నలువదితొమ్మిదివేల యకరముల నేల పొగతోఁటలును, ముప్పదిమూఁడువేల యకరములనేల నిమ్మగడ్డి (సెట్రోనెల్లా) వ్యవసాయముక్రిందను, ఇరువదియాఱువేల యకరములనేల లవంగపుతోఁటలక్రిందను, పదునాల్గువేల యకరములనేల కోకో తోఁటలక్రిందను, పదునాల్గువేల యకరముల నేల పొగాకుపంటక్రిందను, పదివేల యకరముల నేల తాటిచెట్ల యడవిక్రిందను, ఆఱువేలయకరములనేల యేలకులపంటక్రిందను గలదని తేలుచున్నది. ఈపరిస్థితులనుండి సింహళమున భూములకు మంచివిలువ కలదనియే చెప్పవచ్చును. ఇవిగాక యరణ్యముల క్రిందనున్న భూములు విరివిగాఁ గలవు.

## కొబ్బరితోఁటలు.

దీని నఱవభాషయందు తేంగాయి యనెదరు. తేన్ అనిన నఱవభాషయందు దక్షిణమున కర్థము. కాన దీనికి దక్షిణపు కాయ యనిపేరు. ఆదిని నీచెట్లో, వాటివిత్తనములగు కొబ్బరి పండ్లో యీద్వీపమునకుదక్షిణమునసున్న హిందూమహాసముద్రము నందలి ద్వీపములనుండి సింహళమునకుఁ దెచ్చినతఱి దాని నఱవలు తేంగాయి యనిరి. అదియే రానురాను పేరయ్యెను. పిదప నిటనుండి భరతదేశపుదక్షిణ(అఱవ) సీమలకుఁ గొంపోయిన కతన వారికిని సింహళము దక్షిణదిశయే గాన తేంగాయిగనే యమరెను. నేఁటికిని ఆయఱవ లట్లే దీనిని వాడుచున్నారు.

ఈచెట్లవేళ్ళకడకు నీటిచెమ్మ తగులుచుండవలయును. సముద్రపు టుప్పునీరైనను దీనికి హితవే. సముద్రపు నీటిమట్టముపై

౧౫౦౦ అడుగులపై నెత్తుప్రదేశముల నివి పెరుగవు. పెరిఁగినను కాయవు. ఏటేట నేఁబది మొదలు తొంబదిదనుక నంగుళముల వర్షపాతముగల ప్రదేశము లిచెట్టున కెక్కువ యనుకూలప్రదేశములని పరిశీలనలనుండి తేలినది. ఈద్వీపమునఁ గొబ్బరిచెట్లు నాటిన నాలు వత్సరములకుఁ గాయనారంభించును. దానిపండేగాక కొబ్బరిపై పెంకు చుట్టుఁగలపీచు, కొబ్బరిమట్టలు, ఆకులుగూడ నుపయోగించునవియే గాన నమ్ముడుపోవుట ద్వీపమునం దెల్లదిశల నీతో˙టలే కాన్పించెడిని. ఇంక నధికముగ దక్షిణపశ్చిమభాగముల నీచెట్లను కడుంగడు సమీపముగఁ దో˙టలందు నాటి కల్లును కల్లుగను, కాచినసారాయిగను నిషాపానీయములను ద్వీపవాసులు వాడుచున్నారు. కాయలను రెండునెలల కొకసారిగఁ జెట్లనుండి తీయుదురు. పరిస్థితు లనుకూలింప నాతేండ్లకును అననుకూలమగునేని పదిసంవత్సరములవఱకు నాలస్యముగను ఈచెట్లు కాయ మొదలిడును. సముద్రపు గాలులు వీటి కనుకూలములు. సముద్రపునీటిదనుక నీతో˙టలుఁ జక్కఁగఁ బెరిగి కాయ నారంభించెడిని.

కొబ్బరిచెట్లు మనుష్యసంచారము లేని తావులయందు బ్రతుకవనియు, మనుష్యులమాటలధ్వని వాటిజీవనమున కవసర మనియు నిచటివా రనెదరు. నిజముగ నిది మనుష్యులు నాటి పెంచవలసినదే కాని మనుష్యసంచారము లేని యడవులం దితరచెట్లవలెఁ దనంతట తానే మొలచి పెఱుగునది కాదు. అడవులం దెచ్చటను గానరాదు. కొబ్బరిపీచు, (డొక్కలు) నీటియందు నానించి చితుకఁగొట్టి దులిపి తాండ్రుగ పేనుట యొకవృత్తిగ నున్నది గాన నెటనున్న నట లో˙తులేని సముద్రపుచెలకలు, నీరు నిలిచినపల్లములు మొదలగు వాటియందు గొబ్బరిడొక్కల నూరవేయుచుందురు. అట్లూరినతావులందే కాక నాపరిసరములందు సహా మలేరియా

జ్వరములుండ వనియు, ఆపురుగులను వహించుదోమ లట బ్రతుక వనియు నొక సింహళరసాయనశాస్త్రవేత్త ఋజువుపఱచెను.

కొబ్బరిచెట్లకలప తాటికలపవలెనే ద్వీపవాసులు వాడెదరు. అందు వంకరలతావునఁ జాల గట్టిగ నుండునట. ఆకులతడకలతో నిండ్లు నేయుదురు, పందిళ్ళకుఁగప్పు వేయుదురు. కూర్చుండుచాపలుగ నుపయోగింతురు. ఆకులనులెక్కించి కట్టలుగఁ గట్టి దివిటీలుగఁ జీఁకటిలో వెల్గించుకొని పోవుట తఱచుగఁ గానవయ్యెడిని. వీటి లెక్కను, గట్టిని పరిశీలించి యది యెన్నిమినిట్లుకాలునో లెక్కించి చెప్పవారుకలరు. పెద్దజాతి (సింగపూరుకొబ్బరి యనఁబడుజాతి) కొబ్బరి యీద్వీపమునకు సింగపూరుసీమనుండి తెచ్చి నాటి పెంచి కాపించుచున్నారు. దానినాంగ్లేయులు కింగ్‌కోకోనట్ (King coconut) అనెదరు. వర్షాకాలపుజడివానలందు వీచు ప్రచండ వాయువుల కీకొబ్బరిచెట్లు వంకరలుపడుట సర్వసాధారణమే. వంకరలేని కొబ్బరిచెట్లను, చచ్చినకోఁతిని జూచినవాఁడు చిరకాలజీవి యగు ననుసామెత యిట నేర్పాటైనది. చచ్చినకోఁతి కానరాదు. కొలంబోనగరమునుండి గాలీరేవున కేగుతఱి బాటయే గాక యినుపదారియు, గ్రామములు, పురములు కొబ్బరితోఁటల క్రిందనే యున్నట్లుండును. రబ్బరుతోఁట లీద్వీపమున నధికముగఁ గలవు. ఒకపాశ్చాత్యపరిశీలకుఁ డచిరకాలముననే నీసింహళము గొప్ప Rubber producing area కానున్నదని నుడివియున్నాఁడు. కొన్నితావులందు దీనిలాభమును గాంచినవారు తేయాకుతోఁటలు పీకివైచి రబ్బరుతోఁటల నాటినయుదాహరణములు పెక్కుగలవు. రబ్బరుతోఁటలు సముద్రపునీటిమట్టమునుండి రెండువేలయడుగుల యెత్తుదనుకఁ బెరుఁగునని చెప్పఁబడినది.

## తేయాకుతోఁటలు.

ఇంక నీసింహళమున నధికముగ నాటఁబడిన తేయాకు తోఁట లైదులక్షల యేఁబదియేడువేల రెండువందల యెనుబది నాల్గుయకరముల ప్రదేశము నాక్రమించియున్నవి. ఇవి సముద్రపు నీటిమట్టమునుండియు నాలువేలయడుగుల యెత్తుదనుకఁ బెరుఁగు ననియు, నందు ౧౫౦౦ అడుగులయెత్తునుండియు ౫౦౦౦ అడుగుల యెత్తుదనుక నైన తేయాకు ఎక్కువబలమగు పరిమళముగల్గి యధికముగ ఫలించి హెచ్చుధరల కమ్ముడుపోవుచుండు ననియు, నితర ప్రదేశములందు పైరైన తేయాకునందుఁ బరిమళమునకు దీనిని గొంత కలుపుచుందు రనియుఁ జెప్పబడినది.

సింహళమున నీ తేయాకుతోఁటలు కొండలప్రక్కలందు నాటఁబడి ఫలించుచున్నవి. ఇవి యీ దేశమున ౨౩౬౨ ఎస్టేటులనియు, ౬౮౮౭౬ హోల్డింగు లనియు నేర్పాటు చేయఁబడి పేరందియున్నవి. తేయాకుపంట యధికముగాఁగల తేయాకుసీమను నాంగ్లమున Tea Districts అనుచున్నారు. ఆది నీప్రదేశములందు కాఫీతోఁటలు ప్రారంభింపఁబడి పెరిఁగి ఫలించుచుండినవఁట. కాని కొన్ని సంవత్సరములపిమ్మట నాకులను బాడుచేసి చెట్లను జంపురోగ మంకురింప తేయాకుతోఁటలు నాట మొదలిడిరఁట. నేఁటికిని ఆకథలు, చరిత్రములు చెప్పువా రాసీమయందుఁ బెక్కండ్రు కలరు.

పిదపఁ జెప్పఁదగినవి పోకతోఁటలు. ఇవి ౬౫౦౦౦ యకరములప్రదేశము నాక్రమించియున్నవి. ఈయాంధ్రదేశమున పీటీ ఆరంగము లనంబడు పోకచెక్క లీసింహళమున బండినవే.

నిమ్మగడ్డి వ్యవసాయముక్రింద ముప్పదిమూఁడువేల యకరములప్రదేశము కలదు. దానినుండి నిమ్మనూనె తీయుదురు. ఇది పరిమళతైలము. దీని నాంగ్లమున సెట్రొనెల్లా యనుచున్నారు.

మూఁడవదియగు దున్హిందాజలపాతము బాదుల్లాపురము నుండి యీశాన్యదిశగా పదమూఁడు మైళ్ళదూరమున బాదులు ఓయానదియొక్క తిరుగుడువంకకడ నున్నది. దీనినుండి విద్యుచ్ఛక్తిని గల్గించి బాదుల్లా పురవీధుల దీపముల కిచ్చుచున్నారు. బాదుల్లా తేయాకు సీమయందలి ముఖ్యస్థానములలో నొకటి.

## ప్రజల వృత్తులు.

ప్రభుత్వమువారు కొన్ని రాజకీయకారణములకుఁగాను సింహళదేశపుఁబ్రజల ముఖ్యవృత్తి సేద్య మని యనినను నిజముగ ముఖ్యవృత్తి తోఁటలుపెంచుచు తోఁటలందుఁ బనిచేయుటయే యనిపించెడిని. ఏలయన కొబ్బరి, రబ్బరు, తేయాకు, షోక, కోకో, లవంగ, ఏలక, తాటిచెట్ల తోఁటలక్రింద ౨౮౧౯౫౦ యకర ములును, ౧౦౩౭౦౦౦ యకరములు వ్యవసాయముక్రింద నుంటయుఁ గానఁబడుచున్నది.

పిమ్మటఁ జెప్పఁదగినది వ్యవసాయము. ఇందు సింహళులు, అఱవలు జీవనోపాధి గల్గియున్నారు. పిదప నీసింహళము చతుస్సముద్రముద్రితద్వీపము గాన సముద్రజలములనుండి యుప్పు పండించుట పెక్కండ్రకు వృత్తిగ నున్నది. సంవత్సరమునందు ౬౬౦౦౦౦ హండ్రడు వెయిటుల సముద్రలవణము పండించి యెత్తఁ బడుచున్నట్లు ఉత్తరప్రాంతములందు, ఎలిఫెంటు పేసుగల్లీలు, పశ్చిమోత్తరపరగణాలలోనిపుత్తాలంప్రాంతమున పులాలీగల్లీలుఅంచనా వేయఁబడినవి. జాఫ్నా, హంబను తోటసీమలందుఁగొందఱకు సొంత గల్లీలు కలవు. వీటినుండియు నుప్పు తీయఁబడుచున్నది. కొన్ని సముద్రపుచెలకలు వర్షాకాలమున మున్గి వేసవియం దెండిపోవునవి కలవు. వాట్లనుండి యెండినయుప్పు నేఱుచున్నారు.

సింహళమున గ్రాఫైటు లేక ప్లొంబాగో లోహము కడుం బ్రశస్తమైన రకము త్రవ్వి యెత్తఁబడుచున్నది. చక్కఁగా దొరకిన సంవత్సరములందు ౨౮౦౦౦౦ హండ్రెడువెయిటుల లోహము దొరకునని లెక్కలనుండి తేలుచున్నది. ఈగ్రాఫైటు గనులనుండి త్రవ్వఁబడి కొలంబోనగరమున కంపఁబడుచున్నది. ఇట దీనిని శుభ్రపఱచి యేఁటేటఁ గొన్ని వేలతఱబడిటన్నుల నైరోపా కెగుమతి చేయుచున్నారు. కొలంబోనగరమునఁ గొబ్బరియాకుతడకలతో నేయఁబడిన పాకలందు దీనిని పరిశుభ్రపఱచి పెట్టెలలో నింపుదురు. ఆపని పెంకుటిండ్లలో జేయరాదఁట. గాలిలో నిది తేలిపై కెగసి యింటికప్పునకుఁ జేరి పెంకులనడుమ జేరుకొని వాటిని జారజేసి క్రిందికిఁబడున ట్లొనర్చునఁట.

సింహళమునుజుట్టి సముద్రతీరగ్రామములందుఁ జేతిపనులధికముగా పురుషులే గాక స్త్రీలు, పిల్లలుగూడఁ జేయుచుంట గాననగును. ఇట్టితావులు కొలంబోనుండి ౧౮ మైళ్ళ దూరమునందున్న మొరాతువా గ్రామము చక్కని చెక్కడపుపనికిని, కాలూగంగానదీ ముఖద్వారమునకడనున్న కాలూతరగ్రామము బుట్టలు, తట్టలు, పెట్టెలు, టోపీలు, సంచులు నల్లుటకును బేరందినవి. ఇట్టివి మితిమీఱికలవు.

రత్నపురము పరిసరప్రాంతములే గాక యానీమయం దంతటను రత్నములు దొరకుగనులు కలవు. ఇచటిపచ్చలు, కెంపులు, చంద్రకాంతమణులు సుప్రసిద్ధములు. ఇంక మరకతములు Thorium-Uranium మొదలగునవి బాగుగనే దొరకుచున్నవి. అవి త్రవ్వి గైకొనుటయు, సానపట్టి ముఖములు, ఆకారములు కోసి కుదుర్చుటయుఁ గొందఱకు వృత్తిగా నున్నది. తఱచుగ మహమ్మదీయులు కోఁతపనివాండ్రుగ నున్నారు.

ఈద్వీపపు పశ్చిమోత్తరదిశను సముద్రమున ముత్యాల సలాప మప్పటప్పటఁ గల్గుచుండెడిని. కాని యిది ప్రభుత్వము వారిదిగ నుంట ప్రజల కొకవృత్తిగ నుండ లేదు. ఇందుఁ బనిచేయు వాండ్రకు జీవనోపాధి గల్గించునదిగమాత్ర మున్నది.

## ముత్యాలసలాపము

సముద్రమున నొక్కొక మరుగుప్రదేశమునందు ముత్యపు చిప్పలజంతువులు జీవింపఁ గల్గెడిని. అనఁగా సముద్రజలప్రవాహ ములు (Ocean currents) నం దివి కొట్టుకొనిపోకుండ మఱుగు గా నుండవలెనని భావము. ఇట్టి ప్రదేశముల కాంగ్లమున పెర ల్బాంక్సు (Pearl Banks) అనెదరు. ముత్తెపుఁజిప్పకు సం స్కృతమున శుక్తి యనెదరు.

ఇట్టితావులలో నొకటి సింహళద్వీపమున కీశాన్యదిశను మన్నారుద్వీపమునుండి పుత్తాలముదనుకఁ గల సముద్రపుఅఖాత మున దరినుండి ౧౨ మైళ్ళదూరమందు ౧౦ ఫాతములలోఁతుగల సముద్రజలములందు మఱుఁగుప్రదేశమున పెరల్బాంక్సు కలవు. ఇత్తావున కెరటములుండక జలములు నిశ్చలముగ విశ్రాంతిఁ గొని నట్లుండెడిని. సముద్రజలప్రవాహము లిటఁ దగులవుగాన ముత్యపు జిప్పలజంతువుల కేబాధయుఁ దఱచు గలుగదు. కావున నవికొంత వఱకు నిర్భయముగ నిట జీవించి నిలువఁగల్గెడిని. ఐనను నిది స్థిర మన వీలుకాదు. ఒకజాతిపక్షు లిట నెగురుచు వీటినిఁ దినివేయు చుండుటచే బాధ తఱచుగఁ గల్గుచుండును. షార్కు అనుపేరుగల జలచరములబాధయు వీటికిఁ గల్గుచుండును. ఇవి చాల తగ్గిపోయి యుంట నేటేట ముత్యాలసలాపము లభించుటకు మాఱుగ రెండు, మూఁడు, లేక నాల్గు సంవత్సరముల కొకసారి పరిణామముగల్గి ముత్యాలసలాపము గల్గుచుండెడిని.

శుక్తిజంతువు లేటేట స్వాతికార్తివానలకొఱకు నిరీక్షించునట్లు ముత్తెపుఁజిప్పలను విప్పుకొని నీటిపై నిరీక్షించుచుండ స్వాతివానచినుకు లాముత్తెపుఁజిప్పయందుఁ బడినతోడనే ముడుఁచుకొనును. అది వాటికి గర్భధారణమును బోలినది. పిదప ఫిబ్రేవరినెల మధ్యకాలమునకు లోన ముత్తెము లెదిగి పక్వస్థితి కల్గెడిని. అత్తఱి తేలి నీటి పైభాగముననే యీఁదులాడుచుండ వాటిని దినపక్షులు పైన నెగురుచుఁ దిరుగులాడుచుంటఁ గాంచి సలాపము గల్గినదని యెఱుంగుదురు. సలాపమున నీటనున్న ముత్తెపుఁజిప్పలనే గాక వాటితోపాటుగఁ బ్రశస్తమైన ధవళశంఖములను, జిత్రవిచిత్రాకారములు, రంగులుగల చిప్పలనుగూడ నెత్తుచున్నారు.

ముత్యాలసలాపము గల్గినకాలమున నాప్రదేశము గొప్ప కలకలము గల్గియుండును. అటకు సమీపముననే గల మారిచ్చికడ్డె యనుపేరుగల కుగ్రామ మెట్టనిమట్టిభూమియందు దీనావస్థను బ్రదర్శింపుచుండునది. సలాపము కల్గినకాలమున నలువది లేక యేఁబదివేలజనులకు నిలయమై యద్భుతముగ నంగడులసముదాయముతో, గొప్పకలకలముతోఁ గదలికగల్గి పట్టణమో యనునట్లు తనరారెడిని. ఇత్తావు ముత్యాలసలాపముపై నాధారపడినదియే గాని వేఱేయాధారమును లేదు.

ఫిబ్రేవరినెలమధ్య లేక ప్రారంభమునం దీసలాప మారంభమగుచు నాఱు లేక యెన్మిదివారములదనుక నుండెడిని. నీటనున్న చిప్పలను బోఁగుచేసి సంచులందు నింపుపనివాండ్రిటఁ దఱచుగ మహమ్మదీయులుగ నున్నారు. వారికి మూఢవిశ్వాసములు మెండు. షార్కు (జలచరము)లనుండి బాధకల్గకుండ దేవునిపవిత్రనామములు వ్రాయఁబడినతాయెత్తులను ధరించుచుందురు. నిజముగ నట కరిగెడి పడవలు జనులసందడికి జడిసి యింకను సముద్రపు లోబారునకు పాఱిపోవునని యచటివా రనుచుందురు.

4

ముత్యాలసలాప ప్రయత్నములు సాయంకాలములందుఁ బ్రారంభమగుచుండును. పదిటన్నులబరువును మోయఁగల పడవలీ నద్దెకుఁ గుదుర్చుకొని నీటమున్గువారలనుఁ గూలికిఁ గుదుర్చుకొని వర్తకు లాపడవలందు సాయంకాలము గాలియొడ్డునుండి లోఁబారునకు వీవఁ బ్రారంభింపగనే బయలుదేఱి పండ్రెండు లేక పదునైదు మైళ్ళదూరము లోఁబారుగ గరిగి దీపములతో రాత్రి యంతయు నట నిలిచెదరు. ఇట్టిపడవలు నూటయేఁబదివఱకు తఱచు దినదిన మేగుచుండు నందురు. సూర్యోదయముతో గాలి యాఁగి నిశ్శబ్ద మగును. కెరటము లట నీటియం దసలే యుండవు. అత్తరుణమున నీటిలోనికి దిగనారంభింతురు. ఒక బలమగుత్రాటికి సంచులనుగట్టి వేఱొకత్రాటికి బరువగుఱాతిని కట్టి ఱాతిపై మున్గు పనివాండ్రు నిలిచియుండి ఱాతిబరువునఁ గ్రిందికి మున్గెదరు. తోడనే రెండు త్రాళ్లకుఁ గట్టినబంధములు తెగఁగోసి ముత్తెపుచిప్పలు ప్రోగుచేసి సంచులలో నింప మొదలిడి సంచుత్రాటిని పట్టుకొని పైకి వచ్చును. తఱచుగ నీట మున్గినపనివాఁ డఱువది లేక డెబ్బది సెకండ్లకాల మట్లు నీటియం దుండఁ గల్గెడిని. కొంద ఱారిందాపని వాండ్రు ౧౨౦ సెకండ్లకాలము (రెండు మినిట్లు గూడ) నుండఁ గల్గుదురు. ఇట్లు సూర్యోదయకాల మాదిగ పగలు పండ్రెండుగంటల (అపరాహ్ణము) దనుక సలాపము నడిచెడిని. అంతట గాలి సముద్రమునుండి యొడ్డునకు వీవ నారంభించుటతోఁ ద్వరపడి పడవలు బరువుసంచులతో దరికి మరలును. తెచ్చినగుల్లల నేలము వేసి వర్తకులు సొమ్మునందుదురు. ప్రభుత్వమువారు పడవకు మనుష్యున కింతయని లైసెన్సు సొమ్ముఁ గైకొనెదరు.

# కేండీపురము - పేరేహారా-ఊరేగింపు.

ఇది సింహళద్వీప మంతటనుఁ బేరందిన గొప్ప యూరేగింపుటుత్సవము. కేండీపురమున దలదమాలిగావా దేవస్థానమున భద్రపఱుపఁబడి పూజ లందుచున్న బుద్ధభగవానుని దంతము నీమహోత్సవమున కేండీసామంతు లంగరక్షకులై, రత్నాలంకారధరులై సపరివారవైభవోపేతులై, ఆగస్టునెల పౌర్ణమిదినము సాయంకాలమునుండి కేండీపురమున నూరేగింతురు. దీనివైభవమును గాంచుటకు వేనవేలుగఁ జూపరులు దేశదేశములనుండి యరుదెంచి చూచి యచ్చెరువందుచుందురు.

పేరేహారా యనిన సింహళభాషయం దూరేగింపనియే యర్థము. ఇది పౌర్ణమితో నంతమగు పదిదినములందు జరుగుచుండు నూరేగింపు. పురమునం దుత్సవము. నడుచుమార్గము లన్నియు నలంకరింపఁబడి రాత్రులందు దీపావళిని జరుపుదురు. ప్రారంభమున దళదమాలిగావా (దంతమునుంచిన దేవస్థానము) ద్వారముకడకు దేవస్థానపుటేనుఁగు, వేర్వేఱుసామంతుల (Kandian chiefs) నెక్కించుకొనిన యేనుఁగులు నెక్కువగా స్వర్ణాభరణములచేతను, రత్నముల చేతను నలంకరింపఁబడి యేతెంచి నిలిచియుండ బుద్ధదంతమును దెచ్చి ప్రధాన గజము నెక్కింపనుత్సవము బయలుదేఱును. వేషధారులగు నటకులు, మేళతాళములవాండ్రు, దివిటీలు దీపములుపట్టువాండ్రు తరతరములుగ నీయుత్సవపుఁ గొల్వునందుండిన కుటుంబములవారే గాన మహోత్సవమునందు వారి కర్తవ్యస్థలము లేర్పడియే యున్నవఁట. సామంతులు ధరించిన రత్నాభరణములు దేదీప్యమైన కాంతుల నీనుచు వింతగొల్పెడిని. దీపావళీ వైభవవిశేషదృశ్యములు చూడఁదగినవిగ నుండెడిని.

ప్రధానగజమగు దేవస్థానపుటేనుఁగు చాలపెద్దది. ఇదియే బుద్ధదంతమును మోయునది. స్వర్ణమయముగ నలంకరింపఁబడెడిని. దానిదంతములకుఁగూడ బంగారురేకులడోలకలు తగిల్చెద రన దానియలంకార మెంతటిదో చదువరులే యూహింపవచ్చును. దేవాలయద్వారమునుండి సోపానములు దిగి క్రిందిబాటకుఁ జేరుటతో గొప్పసామంతుల దంతావళము లిందుఁ జేరుకొని; యుత్సవము బలపడెడిని. అన్ని యేనుఁగు లలంకరింపఁబడియే యుండెడిని. మహోత్సవము పురవీథులగుండా నడుచుచుఁ గొన్ని దేవళముల ప్రక్కఁబడి క్వీన్సుహోటేలుపరిసరములుగ పురమధ్యమునందున్న పవిత్రసరస్సున కరిగి తిరుగ మరలెడిని. ఈమహోత్సవవాద్యములందు ధవళశంఖనాదములుకూడ నుండెడిని. ఉత్సవ మూరేగుచు నడుమనడుమ నాఁగుచుండుతఱి సామంతులయెదుట వారివారలు మృదంగతాళవాద్యయుక్తముగ ఆసామంతకుటుంబము వారి పూర్వులపౌరుషగాథలు,ఘనకార్యాచరణకథనములు పాడుచు నాట్యమాడుచుందురు. కొంతవడి ప్రధానదంతావళమున కెదుట బుద్ధదంతకథనమును బాడుచు దానిమాహాత్మ్య మహోన్నత్యకథనములను బాడి నృత్యముచే నెల్లరఁ బరవశులఁ జేయుదురు. ఆ యేనుఁగు భూమిపై నడువక విలువగల రత్నకంబళములపైననే నడిచెడిని. ఆరత్నకంబళ మేనుఁగునకు ముందుగఁ బఱపఁబడుచు నడచినపైన వెనుకచుట్ట ముందునకుఁ గొంపోయి తిరుగ విప్పుచు నిట్లు నాల్గురత్నకంబళము లుపయోగింపఁబడెడిని. ఈపవిత్రగజమునెడల నెల్లరతివినయగౌరవములను జూపెదరు.

ఈ పేరేహేరామహోత్సవమున బౌద్ధభిక్షువులు చేయుపనులుండవు. ఇది కేండియన్ సామంతులు కూడ నరుగుచుంట బుద్ధభగవానునిదంతమునకు వారంజలు భద్రముగనుంచి కాపాడు రక్షకగౌరవము నేటేటఁ బడయుట కీమహోత్సవము జరపుచుందురఁట.

# చరిత్రాంశములు.

## ఒకటవభాగము.

ఇప్పటిసింహళద్వీప మాదిని లంకారాజ్య మనఁబరఁగుచు రాక్షసుఁడును, కశ్యపసంతతివాఁడును, శైవుఁడును, గొప్ప వేద వేత్తయు, మహాపండితకవియు, వైద్యవిద్యావిశారదుఁడును, అమిత బలశాలియు నగు రావణభూపతియొక్క పాలనయం దుండె ననియు, ఆతని నాఁటిరాజధాని లంకాపట్టణ మనుపేరఁ బరఁగు చుండె ననియు, రామాయణమునుండి తెలిసెడిని. ఆలంకాపట్టణ మిక్కాలమున సముద్రగామియై యున్నదని యత్తావు నిపుడు గ్రేట్ బేసిస్, లిటిల్ బేసిస్ అనంబడుతావులను రావణదుర్గ ముగ నచటివారు చూపుచున్నారు. ఇంక రామాయణ కథాంతర్గత మగు శ్రీరాముని రాజ్ఞియగు సీతామహాదేవిని జెఱఁగొని తెచ్చి నప్పటి ప్రవాసనివాస మిప్పుడు సీతాఎలియా యనంబడుచుం టయు, నట నామె దాహము తీర్చుకొనిన జలబుద్బుదము, దాని ప్రవాహము సీతావాక యనంబడుచుఁ జిన్నప్రవాహమై యుం టయుఁ జూడఁదగినతావులందుఁ దెలియనగుచున్నది. రామాయణ యుద్ధమునకు ఫలితమగు రావణవధానంతర మాయనసోదరుఁడు విభీషణభూపతి లంకారాజ్యసింహాసన మధిష్ఠించెనఁట.

ఈరాక్షసవంశమునకుఁ బిదపఁ జరిత్ర మిదమిద్ధమని చెప్పు టకు బయలుపడకున్నది. నేఁటికిని వెడ్డాలు లేక యాక్కో లను నడవిజాతి మనుష్యులు రాక్షసులకు స్వదేశ (నర) స్త్రీలయందుఁ గల్గినసంతతిగఁ జెప్పుదురు. వారిప్పుడు నరులుగనేయున్నారు. శ్రీరామసేతువు (ఇప్పటిఆడమ్సుబ్రిడ్జి) రామాయణయుద్ధమున కా కాలముననే శ్రీరామునిచే నిర్మింపఁ బడి నేఁటికిని ధనుష్కోటి యనంబడుచు హిందువులకుఁ బవిత్రస్నానతీర్థమై దనరుచున్నది.

రామాయణకథసమే యబద్ధమను పరిశీలకులు కొందఱును, ఆనాఁటి లంకారాజ్య మీనాఁటిసింహళము కానేర దనుపరిశీలకులు కొంద ఱును వేర్వేఱుకారణములనుబట్టి యట్లువాదించుచున్నను వాటిని ఖాటింప నక్కఱయయుండదు. వెడ్డాజాతివారినిగూర్చి పరిస్థితులు మనుష్యు లనంబడు శీర్షికక్రింద వివరింపఁబడినది. వీరి సామంతుల యధికారపాలనలు సింహళులు వచ్చుదనుక నుండెనని తోఁచెడిని. వెడ్డాయనిన వేఁటకాఁడని యర్థము గాన వా రడవులుపట్టి సింహ ళులబారికి నిల్వలేక దాఁగుటకుఁ బిదప నీపేరు వారికిఁ గల్గనోవు.

ఇప్పటికిని వెడ్డా జాతివారు పార్కకంట్రీ యనఁబరఁగు లోఁగొండలయడవులందు వసించుచున్నారు. వీ రగ్రజాతివా రని తక్కనవారు వీరికి పిల్లలనిత్తురుగాని వీరిపిల్లల నన్యులు పరిణయము చేసికొనరఁట. విల్లంబులు ధరించియుండు వేఁటకాండ్రు; కొండగుహ లలో వసింతురు. తీగెలతో నిచ్చెనలుచేసికొని కొండల నెక్కి దిగు చుందురు. వారిముఖ్యాధారము తేనె, వేఁటమాంసము మొదలగు నవి యటఁ గొడ్డుమాంసమును, గోమాంసమును దినరు. గోభక్తి కలవారు. వా రుండుదేశసీమలందు వేఁడినీళ్ళయూట లధికము. అం దనుదినము స్నానము లొనర్తురు. ఈసీమలందుఁ దొమ్మిది లేక పదియడుగులపుట్టలందు గోనాగసర్పము లుండెడిని. వీ రన్యుల కంటఁబడ నిచ్చగింపక మఱుగున దాఁగియుండియే మాటలాడు దురు. మధ్యకాలములందు భరతదేశమునుండియు, పారశీకమునుం డియు, అరబ్బీ గ్రీకు దేశములనుండియు సింహళమున కరుదెంచి వెడ్డాలతో నడవిసామానులవర్తక మొనర్చుతఱిని సైతము వారి కగపడకయే వర్తక మొనర్చుచుండి రఁట.

## సింహళులు

పిదప దక్షిణఇండియాదేశపు టఱవ (దమ్మిళులు) లదే పనిగ సింహళముపై దాడివెడలుచు సింహళులను స్తిమితముగ

నుండనీయలే దనియుఁ దెలియుచున్నది. ఆయుద్ధములకు విధివిరామములు లేకుండె నందురు.

వీరు వెడ్డాలను లోఁగఁదీసి వశపఱచుకొనుటకే రెండు వందలసంవత్సరములు పట్టెనఁట. అనఁగా క్రీ॥ ము॥ 383 సంవత్సరముదనుక వెడ్డాలతిరుగుబాటు పూర్తిగా మానలేదని భావము. ఇది యిటుండ సింహళభూపతులకుఁ గడవఱకును దక్షిణఇండియా నుండి దండయాత్రలదేపనిగఁ జల్పుచు బాధించుచుండు నఱవల (దమ్మిళుల) నుండి చికాకు లోకేరీతిని గల్గుచునేయుండెను. కాని యొకఁడ్దరిపాలనలందుఁ దప్పఁ దక్కినవారికి విశ్రాంతి సరిగా లేకుండెనని చెప్పఁబడెను. ఈచికాకులనుగూర్చి పెక్కుగాథలున్నవి.

ఇంతవఱ కీసింహళభూపతులు హిందూమతస్థులుగనే యుండిరి. క్రీ॥ ము॥ 245 నాఁడు తిస్సా (బహుశః త్రిభువనాశ్రియ) మహీపాలుఁ డను సింహళభూపతి రాజ్య మేలుచుండ భరతభూమినుండి అశోకచక్రవర్తితనయుఁడు మహిందో (మహేంద్రుఁడు) తండ్రికిఁ బిదప సామ్రాజ్యసింహాసన మొల్లక బౌద్ధభిక్షువుగనై బౌద్ధమతబోధ యొనర్చుచు సింహళమునకు శిష్యజనసహితుఁడై యరుదెంచి మహింతల్ కొండపై నుండ నటకు వేఁటకరుదెంచిన తిస్సా (సింహళ) భూపాలుని గాంచి తన శక్తిపాతవశమున వశపఱచుకొని బుద్ధబోధల నెఱపి బౌద్ధునిగా నొనర్చెను. నాఁడాదిగఁ బెక్కుండ్రు బౌద్ధులు కా సాగిరి. అట్లు కడకు సింహళులందఱు బౌద్ధమతమునఁ జేరిపోయిరి. (మహింతల్ చూడుఁడు.) తిస్సామహీపాలుఁడును గొప్పభక్తుఁ డగుట బ్రిజలాయనను దేవనంపియా (దేవానాంప్రియ) తిస్సామహారాజని వాడుచుండిరి. ఈయన తూపారామము మొదలగు పెక్కు బౌద్ధమఠములను గట్టించినవాఁడు. పెక్కు బౌద్ధదేవస్థానముల నిర్మించినవాఁడు.

పిదప దక్షిణఇండియాదమిళులు విజృంభించి సింహళముపై నదేపనిగ దాడివెడలుచుండి యొకతఱి ననూరాధపుర మాక్రమించిరి. సింహళభూపతులు వెఱచి దక్షిణదిశగాఁ గొంతదూరముననున్న రాహూన కరుదెంచి దాఁగి తలదాఁచుకొనవలసి వచ్చెను. అట్లొకతఱి కాకవన్నతిస్సా యను భూపతి రాహూనయందుండుకాలమున నొక సింహళ సామంతరాజకుమార్తె యాయనకడ కార్తనాదముతో నరుదేఱ నామె నోదార్చి యాదరించి పరిణయమాయెను. ఆమెపేరు విహారమహాదేవి. (రాహూన చూడుఁడు.) ఆమె కిర్వురుసుతులు గల్గిరి. వారు ౧ జెమును రాకొమరుఁడు, ౨ తిస్సారాకొమరుఁడు ననంబడువారు. జెమును (బహుశః యమున) అఱవల నడఁచిన బలశాలి. పెక్కు దేవస్థానతటాకారామస్తూపాదుల నిర్మించిన సుప్రసిద్ధుఁడు. తండ్రిని పెక్కుసారులు ప్రార్థించి వేసరి దమిళులతోఁ బోరున కింకఁ గొంతకాల మాఁగవలయునని తండ్రి యనుచుంటచే విసిగి రెండు గాజులను (దుతుఅన సింహళ భాషయందు గాజు, హస్తాభరణము) తండ్రి కనిపి తమకొకటియు, నాకొకటియు నని తండ్రితో నన నాతఁడెట్టకేలకు సంగరమునకు దిగెనఁట. జెమును వైరులను బరిమార్చి అనూరాధపురమును బట్టుకొనఁగల్గెనఁట. ఈసంగరము కలుతర ప్రాంతమున జరగెనందురు. దీనికాలము సరిగాఁ దెలియరాకున్నను జమునుపరిపాలన క్రీ.ము. ౧౬౧-౧౩౭ అని తెలిసెడిని. పైగాజుల కథనుబట్టి యీభూపతిని దుతుజమును నృపాలుఁడని జనులు పిలువసాఁగిరి. ఈతనికిఁ బిదప నీతనిసోదరుఁడు క్రీ.ము. ౧౩౭ లో సింహాసన మెక్కెను.

క్రీ.ము. ౧౦౩ సంవత్సరములనాఁడు వలగంబనృపాలుఁడు సింహళరాజ్యసింహాసన మధిష్ఠించియుండినట్లు కాన్పించెడిని.

ఈయన రెండుసారు లఱవల (దమ్మిళుల) బారికి వెఱచి తనరాజధానిని వీడి యొకసారి ఆలూవిహారముననను, వేఱొకసారి దంబుల్లా శైలకందరముననను దాఁగవలసివచ్చె ననియు నందు దంబుల్లా (దమిల్లా) గుహానివాసము క్రీ.ము. ౧౦౩అనియుఁ దెలియుచున్నది.

క్రీ.ము. ౨౦ మొదలు క్రీ.వె. ౯వఱకు భక్తికాభయుఁడు రాజ్య మేలినట్లును గలదు. ఈతఁడే జమునుకట్టించిన లోహామహాపయానుబంధమహాస్తూపమునకుఁ జిత్రవర్ణములపూఁత పూయించె నని చెప్పఁబడియున్నది.

క్రీస్తుప్రభువు పుట్టుటకుఁ బూర్వము నడచిన యిట్టిగాథల ముగించుటకుమున్ను విజయునితో నాతనిసైన్యాధిపతిగా నీసింహళమున కరుదెంచిన విజితునిపేర విజితపురము నిర్మింపఁబడె ననియు, దానికాలము సరిగాఁ దెలియకున్నను క్రీ.ము. ౫౦౦ మొదలు ౬౦౦ సంవత్సరముల నడుమకాల మనియు, నిది యత్తావున నడిచినయుద్ధమున విజితసేనానికిఁ గల్గిన జయమున కానవాలుగ విజయభూపతియాజ్ఞ మేరకు పేరిడఁబడిన దనియుఁ బరిశీలకులు తలంచుచున్నారు.

## చరిత్రాంశములు.

### రెండవభాగము.

సింహళదేశచరిత్రాంశములు వరుసగ లభించి దేశచరిత్రమును సాంగముగ నాదినుండి కడవఱకు వ్రాయఁదగినదిగ మహావంశాదిగ్రంథములనుండి లభింపమి దొరకినంతగఁ జరిత్రాంశములను వ్రాయుట తప్పనివిధిగా నున్నది. క్రీస్తు జన్మించువఱకు భక్తికాభయ నృపాలపాలితముగ నున్న సింహళమునుగూర్చి నడుమ నడుమ లోపములుగానుండుట విచారకరము.

5

పిదప క్రీ॥ వె॥ ౨౭౭ నుండి ౩౦౪ దనుకను మహాసేనుఁ డను నృపాలుని పాలనయని తెలిసెడిని. ఈతఁడే మిన్నేరియావేవా జలస్తంభనస్థానమును (Dam slues) గట్టించిన మహనీయుఁడు. ఈయనవిగ్రహములు భయభక్తిగౌరవములతోఁ బూజింపఁబడుచున్నవి. కాన నీమహాత్ముఁడు పవిత్రజీవన మొనర్చియుండు నని పింపకపోదు. (మిన్నేరియావేవా చూడుఁడు. మిన్నేరియా దేవస్థానము చూడుఁడు.)

పిదప ధాతుసేనుఁ డనునృపతి కొంతవడి రాజ్య మేలెను గాని యీయనను గూర్చి యేమియుఁ దెలియరాకున్నది. ఈతని సుతులొకభార్యవలన ముగల్లాన్ అనుపేరుగలవాఁడును, వేఱొక భార్యవలన కాశ్యపుఁడును రాజ్య మేలియుందురు. అందు కాశ్యపుఁడు క్రీ. వె. ౪౬౩ నుండి ౪౭౯ దనుక రాజ్య మేలినట్లు తోఁచెడిని. ఈతఁడు సిగిరియాపర్వత శిఖరమును సింహాకారముగఁ జేయించి యందు కందరములను దొలిపించి కొంతకాల మందు వసించుచుండెనఁట. ఈతఁడే శత్రువులపోత్సాహమునకు లోనై తన తండ్రిని జెఱలోనుంచి దుర్మరణముపా లొనర్చె ననియు, నీతని సవతియన్నగారు తండ్రిగారి సింహాసనమున కర్హుఁడయ్యు, నీతని దుర్మార్గతకు వెఱచి భరతదేశమునకుఁ బాఱిపోయి దాఁగియుండి కొంతకాలమునకు గొప్పసేనను గూర్చుకొని పదునెన్మిదివత్సరములకుఁ బిదప దాడివెడలి సిగిరియాను ముట్టడింప కాశ్యపుఁ డాత్మహత్య గావించుకొనె నందురు. దీనినిర్మాణము క్రీ. వె. ౪౭౭ అనియు, నిర్మాత కాశియప్ప (బహుశః కాశ్యప) నృపాలుఁ డనియు శాసనము బయల్పడినది. (సిగిరియా చూడుఁడు)

క్రీ॥ వె॥ పండ్రెండవశతాబ్దమునం దనఁగా ౧౧౮౭-౧౧౯౬ కాలమున కీర్తినిశంకమల్లుఁ డనుభూపతి పొలోన్నరువ (పులత్తి)

రాజధానిగ నీసింహళ రాజ్యపాలన మొనర్చెను. నిశంకలతా మండపాయవిహారనిర్మాణ మీతఁ డొనర్చెను. ఇంకను క్రీ॥ వె॥ ౧౧ శతాబ్దాంతముననో లేక ౧౨ శతాబ్దముననో బహుశః ౧౨౭౧ లోపున పొలొన్నరవరాజధానిగ పరాక్రమబాహుఁ డను సింహళ భూపతి యొకఁడు సింహళమంతయు నేకచ్ఛత్రాధిపతిగ నేలెనని చెప్పఁబడియున్నది. ఈతఁడుబహుపరాక్రమశాలియందురు. ఈతఁడు అఱవదమ్మిళులకు భయంకరుఁడై యుండినవాఁడు. ఒకటి రెండు సారులు దక్షిణఇండియాకవలపై దాడి వెడలి జయమందినవాఁడు. కాంబోడియాభూపతి నడంచి యప్పనమును గొన్నవాఁడందురు.

భువనైకబాహుఁ డను సింహళభూపతి క్రీ.వె. ౧౨౭౧ మొదలు ౧౨౮౩ వఱకుఁ బాలించెను. ఈతఁ డెప్పటివాఁడో కాలము సరిగాఁ దెలియదు గాని పొలొన్నరవ (పులత్తి)నుండి రాజధానిని యాపహువాకు మార్చెనఁట. యాపహువా గిరి దుర్గము శుభసేనాపతి యను సింహళసామంతనృపతి యఱవల చీకాకులకు విసిగి నిర్మించుకొని యందు సురక్షితముగ వసించు చుండెను. (యాపహువా చూడుఁడు)కాని (క్రీ.వె.౧౩౦౦-౧౪౦౦) పదునాల్గవశతాబ్దముననే గంపోలా యొకటియు, కురునేగాలా యొకటియు సింహళరాజధానులుగ నుండియుండినట్లు తెలియుచున్నది. ఇట్టిమార్పులకుఁ గారణములు బహుశః సింహళరాజుల దౌర్బల్యస్థితియు, దమ్మిళులపరిభావము నై యుండనోపు.

ఈస్థితిగతు లిట్లుండ క్రీ.వె. ౧౫౦౫లో పోర్చుగీసువారు సింహళద్వీపమున దిగి వర్తక మొనర్ప మొదలిడిరి. తొలుత వీ రిప్పటికొలంబోకడ నోడలు దిగి దరిని కోలోఁతోపో (లవంగపు తోఁట)లుంట దానిని కోలోన్నో యనివాడిరఁట. నానాఁటి కదియే కొలంబో యాయెనందురు.

పదునాఱవశతాబ్దప్రారంభముననో మధ్యనో సరిగాఁ దెలియరాదుకాని సీతావాకకడ సింహళదమ్మిళులకు ఘోరయుద్ధము జరిగెననియు, ఇందు భువనైకబాహువు రెండవవాఁడు. అనఁగా ౧౫౨౧-౧౫౫౩ పాలించిన యొకటవ భువనైకబాహుని సంతతియం దదే పేరుగల వేఱొకభూపతి దమ్మిళులనుజయించి సింహాసనమెక్కెననియుఁ జెప్పఁబడినది. ఆయనకిర్వురుసోదరు లుండిరఁట. అందుఁ గడపటివాఁడు, మయాదున్నీ బహుకుటిలుఁడు. జ్యేష్ఠుఁడగు భువనైకబాహు విర్వురు కనిష్ఠసోదరులకుఁ జెఱియొక సామంతరాజ్యము నిచ్చి గారవించినను మయాదున్నీ పోర్చుగీసువారితో లోపాయికారీ కుట్ర నడిపి జ్యేష్ఠసోదరుని సంగరమున పోర్చుగీసువారిచే జంపించి తాను భూపతియై తన సామంతరాజ్యమును పోర్చుగీసువారి కిచ్చి స్థిరపడెనఁట. అచిరకాలముననే మయాదున్నీ సుతుఁడు రాజసింహుఁడు తండ్రిని బరిమార్చి తాను రాజయ్యెను. ఇది క్రీ. వె. ౧౫౮౧ అని చెప్పఁబడినది.

భ్రాతృద్రోహియగు మయాదున్నీ యొక్క పాలనకాలము సరిగాఁ దెలియరాకున్నది గాని పితృహంతకుఁడగు రాజసింహుని పరిపాలనకాలము క్రీ॥ వె॥ ౧౫౮౧ నుండి ౧౫౯౩ దనుక నని తేలినది. ఈతఁడు కొంతకాలమునకుఁ బశ్చాత్తప్తమనస్కుఁడై స్వమతగురువులగు బౌద్ధభిక్షువులను దన కేమి ప్రాయశ్చిత్త మని యడుగ వారీతనికార్యమునకు వెఱచి యేమో ప్రాయశ్చిత్తము లేదనిరఁట. రాజసింహుఁడు వారిపైఁ గినిసి వారిని శిక్షించి హిందూమతవిద్వాంసులను రావించి యడుగ, వా "రో మహారాజా! పితృహత్యామహాపాతకమునకు శివలింగప్రతిష్ఠ పరిహార" మని దాని విధానమును దెల్పిరఁట. భూనాథుఁ డిందులకు మోదమంది యర్హస్థలమున శివలింగమును బ్రతిష్ఠించి యత్తావునకు బెరండకోవెల

యని పేరిడెనంట. దీనికి సింహాళభాషయందు బశ్చాత్తప్తరక్షక స్థల మని యర్థమంట. కాని యాదేవళ మేటికో పని పూర్తికాక నిలిచిపోయియున్నది. దీనినిర్మాణకాలమును సరిగాఁ దెలుపు నిదర్శనములును లేవు.

ఈకూర్రుని పరిపాలన మంతమొందినపిదప నెవ్వరు రాజయిరో తెలియదు. కాని మఱి తొమ్మిదివత్సరములకు డచ్చి వారు (హోలండుదేశస్థులు) సింహాళమున దిగి వర్తకులుగనుండి వారి సహజవైరులగు పోర్చుగీసువారిని దఱిమి తాము స్థిరపడ రహస్యప్రియత్నము లొనర్చుచుండి రందురు. కాని వారి కాకా ర్యము పిదప నేఁబదినాల్గువత్సరములు గడచువఱకనుకూలింపలేదు. కాని యీలోపుననే వారు బలపడి ప్రజానుకూలతను బడయుచు నెట్టకేలకు క్రీ॥ వె॥ ౧౬౫౬ లో పోర్చుగీసువారి క్రిందనున్న భాగములను లాగుకొని వాటికి డచ్చికోలనీ యని పేరిడిరి. తోడనే రాజ్యమునందు సౌఖ్యకరములగు బాటలు వేయింప నారంభించిరి. క్రీ॥ వె॥ ౧౬౭౮ లో రక్షణార్థము నెగొంబోకోటను గట్ట నారం భించి ముగించిరి. పదునెన్మిదవళతాబ్ద ప్రారంభమునాఁటికి జాఫ్నా పెద్దకోటను గట్టి పిదప ఎలిఫెంటుపేస్ దాఁటు తావున నౌకరక్షక సైన్యదుర్గము గట్టిరి.

ఈకాలముననే అనఁగా క్రీ. వె. ౧౭౯౬ నాఁటికి బ్రిటీషు వారును సింహాళద్వీపమున స్థిరపడుటయే గాక కొన్నిపరగణాలను గూడ నాక్రమించియుండిరి. అచిరకాలముననే అనఁగా క్రీ. వె. ౧౮౧౫ లో కేండీసామంత భూపతులు (Kandian chiefs) ఒకరాజకీయమహాసభ (Conference) కూడి క్రూరుఁడగు తమ భూపతిని సింహాసనమునుండి తొలఁగించి పరిపాలనను బ్రిటీషువారి వశ మొనర్పఁ దీర్మానించిరి. బ్రిటీషు ప్రభుత్వమువారును వానిని

పదభ్రష్టునిఁ జేయుటతో నారాజకుటుంబమునకు మనోవృత్తినిచ్చి దక్షిణఇండియా కనిపివైచిరి. పిదప మూఁడు సంవత్సరములకు అనఁగా క్రీ. శె. ౧౮౧౮ లో క్వీన్‌కోలనీగా సింహళమును బ్రకటించిరి. నేఁటికిని నల్లే ద్వీపమంతయు British Crown Coloney గా నున్నది.

## కొలంబోనగరము.

### పూర్వభాగము.

కొలంబోనగర మిక్కాలమున సింహళద్వీపమునఁ బ్రధాన నగర మని చెప్పఁబడుచున్నది. రాజ్యపరిపాలన నడుపు గవర్నరు గారు వేసవియందుఁ దప్పఁ దక్కినకాలములం దిట వసింతురు. వేసవి యధిక మైయుండుతఱి నూవారాఎలియా సమశీతోష్ణ ప్రదేశమున తిరుగుచుందురు. ఇందు ౨౦౮౧౬౦ జనులు వసించు చున్నా రని లెక్క తేలినది. క్రీ॥ శె॥ ౧౬ శతాబ్దప్రారంభమునఁ జేఁపలవాండ్రు వసించు పల్లెటూళ్ళగనుండి పోర్చుగీసువా రిట దిగినవెనుక నిట నేఁటకిని సుప్రసిద్ధమగు కొలోన్ పో (లవంగపు తోఁట, ఆంగ్లమున Cenemon Gardens) నుండి పేరంది నానాఁటికి కొలంబోగా మాఱినపురము. అనఁగాఁ బ్రాముఖ్యము పోర్చుగీసువారికాలమునుండియే యనిభావము. వారుకట్టిన కోట యొక్క శిథిలభాగములు నేఁటికిని గాననయ్యెడిని. కొలంబోయా కారవ్యవహారాదులం దెక్కువగా నైరోపాఖండపులక్షణములు వహించియున్నదని వాడుకలుకలవు.

కొలంబోకోటయందే కచేరీలు, వర్తకస్థానములు కలవు. గోర్డన్‌పూఁదోఁట (Gordan Gardens) యందు క్వీన్సుహౌస్ అను భవనమున గవర్నరుగారు వసించుచుందురు. పెద్దషాపుఅంగ డులు, ఎంపోరియములు, స్టోర్సు కోటయందే యున్నవి. కోటకు

సమీపముననే పేఁటయున్నది. ఇది స్వదేశవర్తకపు జాగాయై యున్నది. పురాతనపురమందిరము (Old Town Hall) హిందువుల దేవస్థానము. గంటస్తంభము (Bel Fry), కేమెన్సుగేటు నిట దర్శనీయభవనములు. పురాతనపు లవంగపుతోఁట (కోలోన్పో) యిప్పుడు సినిమన్‌గార్డెన్సు అనఁబడుచు బురమందొకభాగమైయున్నది. కాని యిప్పుడు లవంగపుతోఁట లందు లేవు. గొప్పవారివి, యందు ముఖ్యముగ నైరోపా దేశస్థుల నివాసభవనములున్న తావు. గుఱ్ఱపుఁబందెముల మైదానము, క్లబ్బులు, విక్టోరియా.పార్కు-ఉద్యానవనము నిందే కలవు.

మ్యూజియము సుందరమగుభవనము. ఇం దొకగొప్ప పుస్తకభాండాగారమునుగూడ నెలకొల్పియున్నారు. ౧౮౮౫ నుండి ముద్రితములైన గ్రంథము లన్నియు నిందుఁ గలవందురు. పురమందిరమును రాత్రులందుఁ జూడఁదగియున్నదనియు, వెన్నెలలోఁ జక్కనిదృశ్య మొసంగుభవన మనియు ననుచుందురు. ఇచటిబౌద్ధదేవస్థాన మశోకారామ మనుపేరఁ బరగుచున్నది. బౌద్ధులయొక్క చందాధనముతోఁ గట్టఁబడిన నవీననిర్మాణము. చూడఁదగిన భవనము. తిఁబిరిగాస్యరోడ్డునం దున్నది.

కోటకు దక్షిణదిశగా గాలీఫేస్ అనఁబడుచున్న యుద్యానవనమార్గము (Esplanade) కలదు. అది చల్లగానుండు తావును, సముద్రతీరమును నైయుంట ననుదినము నగరవాసులకు సాయంకాల విహారప్రదేశముగ నున్నది. అత్తటి నీబాటను బం డ్లధికముగఁ బర్విడుచుండెడిని. ఈమార్గము గాలీ కరుగును గాన గాలీఫేస్ అనుపేరు వాడుకయయ్యె నఁట. కొలంబోనగరపు బంగాళాలను జుట్టియుండుతోఁటలందుఁ గొబ్బరి, పనస, మామిడి, రొట్టెపండుచెట్లు (Bread Fruit trees) నధికముగా నుండును.

ఇచటిపనసచెట్లు కోమలవయస్సునఁ గొనలను, వయఃకాలమున వలమగు కొమ్మలందునను, కౌమారావస్థయందుఁ జెట్టుమొ్రసు నందునను, వార్ధక్యమున వేళ్ళ (Roots) యందునను గాయలు కాచి ఫలించును. వార్ధక్యమున ఫలించిన పనసపండ్లు వేఱుపనస యనుపేరఁ బరఁగుచు మిగులరుచ్యము లని పేరందియున్నవి. మర్దానాయను భాగమున మాలిగాకండా యనుపేరఁబరఁగు బౌద్ధ దేవళమును, దాని యనుబంధబౌద్ధభిక్షువుల మఠమును గలవు. అందు భిక్షువులను తరఁబీయతు చేయుచుందురు. ఇంకఁ బురమంది రము ప్రక్కనున్న పెద్ద మసీదును దర్శనీయభవనమే. ఇచటి మహమ్మదీయు లరేబియాదేశమున నిస్లాంమత మేర్పడుకాలము ననే యిటకు వలసవచ్చియున్నవార మందురు. గాలీఫేసు ఉద్యాన వనమార్గమునందున్న గొప్పక్రైస్తవదేవళము వింతగొల్పును. ఇందు ఆంగ్లికన్, కమ్యూనిష్టు క్రైస్తవు లధికసంఖ్యాకులు.

కొలంబోనగరమధ్యమున పెద్ద మంచినీటిచెఱువు కలదు. దీనిపరిమితి ౪౧౬ యకరము లని కొలిచియున్నారు. దానిచుట్టు నుండు తీరములు నీటిదనుకఁగూడఁ గొబ్బరితాటిచెట్లుంట గాన నగును. ఇందు మనుష్యులు స్నానము లొనర్చుట, పశువులను గడుగుట, బట్టలనుతుకు చాకిరేవులుంట నీ రంత శుభ్రమై దాహోపయోగకరము కాఁజాలదు. దీనినడుమ నొక పెద్ద ద్వీపము కలదు. అది స్లేవుఐలండు (దాసిసలద్వీపము, Slave Island) అనఁబరఁగుచున్నది. దీనిని గల్పువంతెనయు, దాటయుఁ గలవు. తొల్లింటి డచ్చివారికాలమున దాసిసలు తప్పించుకొని పాఱిపోవకుండనేమోఁ రాత్రులందు పడవలలో నీద్వీపమునకుఁ జేర్చి యిట నిర్బంధమున నుంచి పగ లూరిలోనికిఁ గొంపోవు చుండువారఁట. దానినుండి దీని కీపేరయ్యెనఁట. ఇప్పుడు మలే

తురకలు, ఆఫ్ఘనుతురకలు, నిందు వసించుచున్నారు. కొలంబోలోని పెద్దవీథుల కిరుదెసల నెత్తుగ మనుష్యుల నడకకైన యుపమార్గము (పిల్లబాట)లును, వాటికర్వాస్థలములఁ బైకప్పుగల యిండ్లును గలవు. అవి భూమధ్యరేఖకుఁ గడుసమీపముననేయుండు సింహళమునం దెండలు, వానలు నధికముగాన నవసరముగనేయుండి బాటపై నడుచుపాంథులకు రక్షకములో యనిపించును. ఈనగరమునుండి చూచితిమేని మేఘము లతిత్వరితముగ నాకసమందుఁ గదలుచుం టయుఁ, జిత్రవిచిత్రాకారములను దాల్చుచు మార్చుచుంటయు వింతగ నుండెడిని. ఆకస ముదయమున నెఱ్ఱనియూదారంగును; సాయంకాలములం దింద్రధనుస్సునందుఁ దోఁచు విచిత్రవర్ణసము దాయమును, సూర్యాస్తమయమున నెఱ్ఱని(రక్త)వర్ణమును, నొక్కొక తఱి బుద్ధకిరణములును (సామంతకూటము చూడుఁడు,) వెన్నెల రాత్రిలం దధికకాంతి గల్గిన చంద్రికయు, రాత్రిలందు మెఱుఁ గుడుపురుగుల చలనములును గ్రొత్తవారికి వింత గొల్పకపోవు. కొలంబోనగరమున సగటున బాటలు వెడలుపుగనున్నను నగరము లను బోలి మేడలు, అంతస్తులు నెక్కువగ నున్నవని యనుటకు వీలులేదు. కొలంబోనగర మెక్కువగా నైరోపాయొక్క పోర్లైలను గల్గియున్నను నిది వర్తకవ్యవహారసంబంధముననే గాని బౌద్ధమత హిందూమతధర్మముల దీక్షలందుఁ గాదనిపింపకపోదు. ఉత్తరపు టెల్లగా నీనగరమునకు కెలనీగంగానదీ సాగరసంగమస్థలము పవిత్రస్నానతీర్థముగ నుండుట నచటిస్నానములే తెల్పుచున్నవి.

## కొలంబోనగరము.

### ఉత్తరభాగము.

కొలంబోనగరములఁగూర్చి వివరించుతఱిఁ బూర్వభాగ మునఁ జూడఁదగిన వాటినిగూర్చి వివరించి యిందుఁ దెలియఁదగిన

కొన్ని ముఖ్యాంశములను వివరింతుముగాక. ప్రభుత్వస్థానములును, ప్రభుత్వమును నడుపు గవర్నరుగారి నివాసమును గల ప్రధాననగర మనుటకన్న గొప్పవర్తకస్థానమనియు, రాకపోకల కూడలిస్థాన మనియుఁ జెప్పుటయే సమంజసమని పరిశీలించినఁ దోఁపకపోదు. సముద్రనౌకాశ్రయమగు హార్బరునం దెప్పుడు నెల్లదేశముల యోడ లెగుమతిదిగుమతులతోను, రాకపోకలతోను కదలికగల్గి యుండుటను జూడ నిది గొప్పరేవనియు, వర్తకస్థాన మనియుఁ దెలుపకయే తెలియుచున్నది. ఇంగ్లాండునుండి యాస్ట్రేలియా కరుగుబాట నిది భరతదేశముతోఁ గల్పు సంధివలె నీకొలంబో నగరమున నైరోపాదేశముల వేర్వేఱుజనులును, ఆస్ట్రేలియా తెగలవారును, భరతదేశస్థులగు వేర్వేఱు తెగలవారును గూడఁ గాననగుచుందురు.

ఒక్కొక్కతావున గుమిగూడినట్లు కొలంబో బజారునందు పేఁటలో నొక్కొకభాగమున నొక్కొకదినుసుగల యంగడులు గాననగును. అట్లు సీస్ట్రీటునందు నాటుకోటిసెట్లు బ్యాంకరులుగను, వర్తకులుగను బనిచేయుచుందురు. మెయిన్ స్ట్రీటునందు స్టోరులు, ఎంపోరియములు గుమిగూడిన ట్లుండును. చిల్లరవర్తకులగు మూరు మహమ్మదీయులును గాననగుదురు. వీ రుత్సాహవంతులు. మాట నిలుకడ కల్గినవారు. వర్తకావసరములందుఁ బ్రాలుమాలక వలసిన చో శ్రమకు వెనుదీయువారు కారు. చిల్లరవర్తక మంతయు కొలంబోయందు వీరిహస్తగతముగనే యున్నట్లున్నది. చిల్లర దుకాణములకు సింహళమున బౌటిక్కు యనెదరు. వాటినిముఖ్యముగ మూరులును గొంచెముగా నాటుకోటిసెట్లును నుంచియుందురు.

కొలంబోరేవు నాశ్రయించుకొని బిబ్బీలైను, బ్రిటీషు ఇం డియా స్టీమునావిగేషన్ లైను మొదలగు పదునేడు స్టీమరు లైను

లేజంట్లద్వారా పనిచేయుచుంటయు, నిర్వారు ప్యాసింజ రేజంట్ల యేజన్సీలుంటయు నిచటి రాకపోకలగడబిడయెంతయో యోచింప నయ్యెడిని. వర్తకులకు పెట్టుబడి నీయ ధనికులగు నాటుకోటిసెట్ల సముదాయమే గాక యెన్మిది ప్రత్యేకపుబ్యాంకుల ధనాగారములును, నెన్మిది బ్యాంకింగుకంపెనీలును బనిచేయుచున్నవని తెలియఁగలదు. ఇవిగాక చిల్లరగ నప్పులిచ్చు ఆఫ్ఘను మహమ్మదీయుల వ్యాపార మిట నధికముగాఁ గలదు.

కొలంబోయందు సింహళప్రభుత్వముతోఁ దమదేశపు వర్తకకార్యముల సందర్భాదుల నడుప అమెరికాసంయుక్తరాష్ట్రములు, వెనిజులా, పోర్చుగలు, ఇటలీ, స్పానియాదేశము, జర్మనీ, ఫ్రెంచిదేశము, ఫిన్లాండుదేశము, బెల్జియముదేశము, డెన్మార్కు, ఆర్జంటైన్ప్రజాస్వామ్యదేశము, నార్వే, సయామదేశము, జపానుదేశము మొదలగు దేశముల ప్రభుత్వపురాయబారులు కలరనిన వర్తకపుగౌరవ మెంతటిదో యెఱుంగనగును.

ఇచటిపరిస్థితులను వివరించుతఱి ముగింపకమున్ను కొలంబోనగరపు కాకులనుగూర్చియు, పాములనుగూర్చియు వివరింపక పోవుట అసమంజసము. కాకులు లెక్కకు మితిమీఱినట్లును, నితరప్రదేశములందలి కాకులకన్నఁ గడుబలమైనవిగను గాన్పించెడిని. ఒకప్పుడీసింహళము రాక్షసభూమిగనుండుటచే నాస్థితి కర్హమగు కాకు లట్లే యుండియున్నవా యనిపించెడిని. వేర్వేఱుచెట్లపై నగరపరిసరముల రాత్రులందు నివసించుచుఁ బగటివేళఁ బట్టణమునం దెల్లదెసలఁ దిరుగుచు వేనవేలుగా నల్లరను, గల్లత్తును జేయుచు నిండ్లపైనను, గొబ్బరిచెట్లపైనను వరుసలుతీర్చి కూర్చుండును. అఱచిన నెక్కువ ధ్వనియగును. కాకి చాల పెద్దది. తినుబండారములు, రమ్యముగఁ గన్పట్టువస్తువులు, మెఱయువస్తువులు,

వాటికి వీలగునేని యెత్తుకొనిపోవుటకు సర్వదా సిద్ధమే. స్త్రీలవస్తువుల నెత్తుకొనిపోవుటయందు దుష్టతయును, చిన్నపిల్లలనుబాధుచుట యందు దుర్మార్గతయునుగలవి. చిన్న తాళ్ళను ముక్కునఁ గఱచుకొనిపోయి యింటివెన్నునుండి జాఱవిడిచిధ్వనిచేయుచుదొరలుచుంటతో నాకాకు లాడుకొనుచుఁ గాలక్షేపముచేయునట్లు నటించుచుండును. ఇంక నీనగరమున పాములభయ మధికమందురు. మట్టిబుక్కటము లధికముగాఁ గలవు. గోనాగము లొక్కొక్కసారి యరుదుగఁ గన్పించును. త్రాచుపాములు టిక్పోలోనాగము లనంబడు నొకజాతి పాములు, ఆకుపచ్చపోలోనాగములు, కరవిల్లాజాతిపాములు మొదలగు పెక్కుజాతులపాము లనుదినముఁ బ్రత్యక్ష మగుచుండెడిని. సింహళులు పాములనుఁ జంపక వెడలఁదఱుముటకు మాత్రము యత్నింతురు.

ఈద్వీపమున పాము లాఁడుదియు, మగదియుఁ గలసి వసించునఁట. ఒకదానిని జంపిన రెండవది పగఁబూని వేచియుండి కఱచునందురు. మాపిళ్లాయను పేరుగలపాము లింటిపైకప్పుల యిఱుకులందు వసించుననియు, వాటికిఁ గులాభిమానపుఁ బట్టుదల లెక్కువ యనియుఁ, గొన్ని పాములు గొలుసులవలె నొకటితో నింకొకటి చుట్టుకొని కప్పునుండి వ్రేలాడుచుండ వాట్లనుండి దిగి పాము కఱచుననియు, దీనికాటునకుఁ దిరుగులేదనియు నచటివారు చిత్రవిచిత్రగాథలు తెల్పుదురు. సింహళపునౌకరులను సగౌరవముగ అప్పూఅని పిలుచుట నీదేశాచారముగ నున్నది.

## అనూరాధపురము.

ఇది పాడుపడిననగరము. బౌద్ధులయాత్రాస్థలము. కొలంబో నగరమునుండి ౧౨౨ మైళ్లును, కేండీనుండి దంబుల్లా, మిర్సిగోనీ,

ఓయాలమీఁదుగా ౧౬ మైళ్లును, త్రింకోమలీనుండి ౬౭ మైళ్లును దూరము. ఇచట నొకసుప్రసిద్ధమగు తామరకొలను గలదు. అందు వేర్వేఱు జాతుల తామరలు కలవు. రెయిల్వేస్టేషను సమీపముననే నువారావేవా జలనిలయము (Reservoir) కలదు. అది యీనగరమున కాదిని దాహెూదక జలనిలయ మఁట. దీని జల స్తంభనస్థానపుఁ గట్టడము (Dam) పై మోటారు బండ్లు నిర్భయముగఁ బోఁదగినంతవెడలు వున్నది.

దాని కవ్వల మహింతల్ కొండ యగపడుచుండును. క్రీ.ము. ౨౪౭ నుండి ౨౦౭ వఱకు రాజ్యమేలిన దేవనంపియా తిస్సా ఇటనే బౌద్ధుఁ డాయెను. ఆజలనిలయముకడనే గడ్డిపట్టున యొకదిబ్బను ఆర్కియాలోజికల్ ఉద్యోగులు జేతవనవిహార మని యుఁ, బెక్కండ్రు బౌద్ధు లభయగిరియ యనియుఁ బోల్చుచున్నారు. ఇది ధర్మరుచిసంఘబౌద్ధుల ప్రధానస్థాన మఁట. ఆబాటయందే పెద్దయావరణప్రదేశమునం దనేక బోధివృక్షములును, దానిమధ్య నొకచిన్న యావరణమున గయనుండి అశోకచక్రవర్తిసుత యోగిని సంగమిత్త తెచ్చిన సుప్రసిద్ధబోధివృక్షములును కలవు. దీనికొమ్మ లనే భక్తులావనమం దచ్చటచ్చట నాటి పెంచినవఁట. ఇది క్రీ.ము. ఆఱవశతాబ్దమునాఁటి కథ. మహావంశ మనుబౌద్ధమత గ్రంథమున నీబోధివృక్షము చరిత్ర కలదు. తొల్లి యిది మహామేఘుఁ డను సింహళభూపతిచే వినోదవనముగ నేర్పఱుపఁబడి బౌద్ధభిక్షువులకు దానమీయఁబడియున్న దందురు.

దాని కెదురుగ బాట కవ్వలిభాగమున దుతుజమును కట్టించిన లోహామహాపయావిహారపు శిథిలదృశ్యములు రాతి స్తంభముల యడవినిబోలి కన్పట్టుచుండును. ఆయన యఱవ (దమ్మిళ్లు) ల నోడించిన యానవాలుగఁ గట్టఁబడిన దందురు.

దానిపై పెంకు లిత్తఁజేసినగుట నాపేరందేనఁట. దానిప్రక్కనే యాభూపతి నిర్మించిన తదనుబంధమగు "రువన్వేలి శేయ" మహా స్తూపముకలదు. దానికా నరపాలునికి ౧౦౦౦౬౦౦౦౦౦ కహాపనము (సింహళపునాణెము) లు సెలవాయెనఁట. అందనేకపవిత్రపదార్థములు కలవనియు, నందొకటి నవరత్నస్థగిత స్వర్ణబోధివృక్షమనియుఁ జెప్పుదురు. ఈస్తూపమునుగూర్చిన కథన మొకటి వాడుకయందున్నది. అది పూర్తికాకమునుపే జమునునృపతికాలమాసన్నమగుకతన నాతని తమ్ముఁడు సదాతిస్సారాకొమరుఁడు స్తూపము పూర్తియగునో నెట్లు కానఁబడునో యట్లు వెదుళ్ళతోఁ గట్టించి స్తూపముయొక్క వర్ణముగల బట్టలచేఁ గప్పించి చనిపోవనున్న భూపతికిఁజూపి మనశ్శాంతి గల్గించి పిదపఁ దాను భూపతిగనైనతోడనే దానిపని పూర్తిగావించెనఁట.

యాత్రికులీస్తూపమునకుఁ దెల్లజెండాలతో, "సాధుసాధు" అను కేకలతో, మంగళవాద్యములతోఁ బ్రదక్షిణము లొనర్తురు. జూను, జూలై నెలలపౌర్ణములందీయాత్ర యధికముగా నడుచును. దీనికిఁ బశ్చిమమున నభయవాపి కలదు. అది యిక్కాలమున బసవక్కుల మనంబడుచు స్నానతీర్థముగ నున్నది. దీని కుత్తరమునను, దూర్పునను గడువిన్నాణపుఁ బనితనముగల చిత్రములు పెక్కుకలవు. స్తంభచిత్రాదులేగాక యొకతావున నొకకోఁతి తన్నుఁబట్టుకొనినఁ దనపిల్లతోసహా చెట్టుకొమ్మనుండి తలక్రిందుగ వ్రేలాడుచున్నట్లున్న శిలాచిత్రము వాటియందగ్రగణ్యముగ నెంచఁబడుచున్నది. వేఱొకతావున నొకముంగియు, పామును గలహించుచున్నట్లు చిత్రింపఁబడిన చక్కని శిలాచిత్రము కలదు.

ఇత్తావున కుత్తరమున నూఱుగజములదూరమున దేవనంపియాతిస్సా నిర్మింపఁజేసిన తూపారామము కలదు. ఇదియే సింహళ

ద్వీపమున మొదటి నిర్మాణ మందురు. పరిసరములనే సంఘమిత్త్ర శ్మశానపుబూడిదనుంచిన స్తూపము, మహేంద్రోశ్మశానపు బూడిద నుంచిన స్తూపము, ఆప్రక్కనే బుద్ధదంత మీయూరనుండిననాఁటి గృహముయొక్క పునాది యానవాళ్ళు రాణులు వసించిన ప్రాసాదముయొక్క యానవాళ్లు, దానిసోపానముల కంటింపఁబడి నేఁటికిని నట్లేయున్న యర్ధచంద్రాకారపు చంద్రకాంతశిలాఫలకము చక్కని పనితనముకల్గి చూడఁదగినవిగ నున్నవి. ఈప్రక్కనుండి యున్నబాటకు Outer Circular Road అని పేరు. అనూరాధపురము పదునాల్గుమైళ్ల చౌకముగ నుండెడిదఁట. ఇది మహోన్నతదశయందుండుతఱి రోమకపురి నిర్మింపఁబడెనని లెక్కించియున్నారు. ఇట స్నానములతావునకు పోకునా యనియుఁ బేరుకలదు. ఎండిపోయి రాలిపోయినబోధిపత్రములను బౌద్ధయాత్రికు లిండ్లకుఁ గొంపోయి పవిత్రపదార్థములుగ దాఁచికొందురఁట.

## కేండీపురము.

ఈప్రాంతదేశమున కాదిని ఖండదేశ మనియు, దీనికి ఖండపుర మనియుఁ బేరుండి ఖండపురము కేండీ యాయెనందురు. ఇది కొండలలోనున్నపురము. అనూరాధపురమునుండి దంబుల్లామీఁదుగా ౮౬ మైళ్లును, కొలంబోనుండి ౭౨ మైళ్లును దూరము నందున్నది. చరిత్రాత్మకముగ దీనిప్రశంస పదునాల్గవశతాబ్దమునకే కాననగుచున్నను దీనిప్రాముఖ్యము పదునాఱవశతాబ్దమునఁ బోర్చుగీసువారు సామంతులయేర్పా టొనర్చిననాఁటినుండియు ననఁదగును. కొంతకాలము రాజధానీగౌరవము నొందినది. సముద్రపునీటిమట్టముపై ౧౭౭౦ అడుగులమెత్తు. దీనిని బరిశీలకులు బ్రిటీషుసామ్రాజ్యమునఁ జూడఁదగినట్టినైసర్గికసుందరస్థలములలో

నొకటిగ నెంచుచుందురు. ఐనను దీనిప్రాముఖ్య మిది బౌద్ధులకు గొప్ప యాత్రాస్థల మగుటనేయని చెప్పవలయును. పురమధ్యమునం దింకను సౌందర్యరాశియగు కొలను కడపటిభూపతినాఁడు నైసర్గికసరస్సుగా నిర్మింపఁబడినది కలదు. అది యిక్కాలమునఁ బవిత్రస్నానతీర్థముగా నున్నది.

ఇట బుద్ధభగవానునినోటిదంత మొకటి దళదమాలిగావా యనంబడుదేవళమున నొకబంగరుకరండమున భద్రపఱుపఁబడి పూజింపఁబడుచున్నది. అది రెండున్నరయంగుళములపొడవు. ఆంగ్లపరిశీలకులు దీనిని Left canine tooth అనిపోల్చియున్నారు. దేవస్థానమునుజుట్టి గట్టిగోడలును, దానినిజుట్టి కందకమును గలవు. లోన గొప్ప పుస్తకభాండాగార మీపుర మేలిన కడపటిసింహళభూపతి యేర్పఱచినది కలదు. అందుఁ బెక్కుమతగ్రంథములు, శ్రీతాళపత్రలిఖితగ్రంథములు నిల్వయుంపఁబడినవి. ఈదేవస్థానమెత్తగుతావున నున్నది. రాజనివాసభవనమునుండి దేవస్థానావరణములోనికి భూమిగుండా సొరంగము (మార్గము) కలదు.

## మార్గమందలి దృశ్యచిత్రములు.

కొలంబోనగరమునుండి కేండీకరుగునినుపబాటపైఁ బయనమొనర్చుట వినోదకర మనిపించెడిని. కొలంబోపరిసరసీమ సమతలమగుట వరిపొలములు, కొబ్బరితోఁటలు, రబ్బరుతోఁటలు నలువది మైళ్ళుగడచి బండి పశ్చిమోత్తరముగాఁ బర్విడుచు మెరకల కెక్క మొదలిడి తుదకుఁ గొండలకుఁ జేరెడిని. వాటిప్రక్కలు తేయాకుతోఁటలు ప్రారంభమై యిది తేయాకుసీమ యనిపింపకపోదు. బండి కష్టముగఁబై కెక్కుకొలఁది Tropical Zone గానుండిన క్రిందిప్రదేశము మాఱిపోయి Temperate Zone ప్రారంభమగును. చెట్లపువ్వులైరోపాఖండములోనివాటిని బోలిన ట్లుండును. పోలాగహవేలాసంధికడ(ఉత్తరమునకు) అనూరాధపురమున కరుగు మార్గము వేఱైపోవును.

రంబూకానా స్టేషనునుండి బండికి ముందేగాక వెనుకనుగూడ యంత్రపు బండి (Engine) తగిల్చి లాగించుట ప్రారంభమగును. అచిరకాలముననే యొకపాటిచిన్న సొరంగముగుండా దూరి కొండ కవ్వలిభాగమునఁ బ్రవేశింపఁగనే దృశ్యము పూర్తిగ మాఱి యుండును. ఈపర్వతమయసీమయంతయు దట్టమైన యరణ్యములు గల్గి రంగుపూసిన ట్లుండెడిని. అచ్చటచ్చటఁ గొండమడతలలోని లోవలందు వరిపొలములును, నీటివసతిగల్గినతావులందుఁ గొబ్బరి, పోకతోఁటలును గలవు. ఇచటఁ బండు కొండధాన్యము హెచ్చుధర కమ్ముడుపోవుచుండునఁట. చిన్నచిన్న జలనిలయము లచ్చటచ్చటఁ గొండసెలయేఱుల (జలధారల) చే నింపఁబడుచు పొలములకు నీరిచ్చుచుండును. అవి యెండయం దద్దములవలె మెఱయుచుఁ గానఁ బడుచుండును. బండి పర్విడుచుఁ గొండలను జుట్టి వంకరలు తిరుగుచు దాఁగుడుమూఁతలాడునట్లు లోకవంకరచే మాఱినదృశ్య మాకొండను జుట్టి యవ్వల కరుగుటతోఁ దిరుగఁ గన్పించుచు మఱుఁగుపడుచు నచ్చెరువుగొల్పుచుండెడిని.

దీని నింతట వదలి బండి కడుగన్నవసంధికిఁ జేరుదనుక నీపర్వతోపరిశీమలందుఁగల వింతలు వివరింతుము. ఒకచో Castle Rock అనంబడు పర్వతభాగము కలదు. అది పాడుపడుచున్న దుర్గమునుఁ బోలి కన్పట్టుచుంట నాపేరయ్యె నఁట. ఈ పరిసరములనే Bible Rock అనంబడు పీఠభూమి కలదు. ఇది దూరమునుండి చూచువారలకు (కొంతయూహతో) బల్లపైనుండు పుస్తకమువలెఁ గన్పట్టుటచే దాని కాపే రయ్యెనందురు. దానికి దిగువ గుండ్రని పైభాగముకల పెద్దగండశిల కలదు. దానిని (ఛత్రమువలె నుంట) Umbrella Rock అనుచున్నారు. వేఱొకచో నోడయొక్క క్రిందిభాగమును (Keel)బోలి పొడవు, సన్నము, నునుపు గల్గిన

గండశిలను (Keel Rock) అని పిలుచుచున్నారు. రైలుబండి అలగల్లాస్టేషనునకుఁ జేరువఁకుఁ జక్కని దూరదృశ్యము కన్పింప నారంభించెడిని. అచిరకాలముననే Sensational Corner అనఁ బడుతావు చేరువఁకు నేఁబదిమైళ్ళదూరదృశ్య మగపడుచు నొక ప్రక్క నగాధవులోఁతు కన్పట్టెడిని. దీనిపై నెక్కియే బండి నడ చెడిని. ఇది పర్వతమందలి కొనయై యున్నది. దీనిని గడచి బండి కడుగన్నవసంధికిఁ జేరును.

ఇట నినుపబాటయు, బండ్లరస్తాయు దరికిఁ జేరియుండును. ఇది పర్వతోపరిభాగము. ఇట కింకను నెత్తగుతావున నొక తెల్లని పొడవగు స్తంభము, ఈపర్వతసీమలం దాబండ్లరస్తా నిర్మించిన ఎంజనీరు Captain Dawton గారి జ్ఞాపకార్థము నిర్మింపఁబడి యున్నది. ఇట వారమున కొకసారి గొప్పసంత జరగుచుండెడిని. అందుఁ గూరలును, గడుపెద్దవియగు సింగపూరు పెద్దజాతి కొబ్బరి కాయలును (King coconuts) దొరకెడిని. కడుగన్నవసంధి నుండి జగత్ప్రసిద్ధమగు పెరడేనియా బొటానికల్ గార్డెన్సు పది మైళ్లును, కేండీపుర మింకను మూఁడుమైళ్లదూరమును నినుపదారిపై నుండెడిని.

కేండీపురమునఁ జేతిపనులు బాగుగనే జరగుచున్నవి. అవి తక్కినతావులకంటె నెక్కువనిపుణత గలవి యనిపించెడిని. దళద మాలిగావా దేవస్థానపు బుద్ధదంతమునుండి యాత్రాస్థలమగు నీ పురము బౌద్ధులకుఁ గడుంగడుపవిత్రవంతము. ఈసుప్రసిద్ధపవిత్ర పదార్థ మామహాత్మునిశ్మశానమునుండి యెవరో శిష్యులు తీసి రనియు, నది యెట్లో కళింగోత్కలరాజకుమార్తెయగు హేమ మాల యనంబడునామెకుఁ జేరి, నాల్గవశతాబ్దమున సింహళ భూపతియగు కీర్తిశ్రీ మేఘవాహననృపతికడకుఁ జేరి భద్రపఁబుపఁ

బడి మతగౌరవములతోఁ బూజింపఁబడుచుండె ననియుఁ జెప్పఁ బడినది. ఫాహియాను ననుచీనాయాత్రికుఁ డనూరాధపురమున దీనిని దర్శించెనఁట. అట సంవత్సరమునందు మూఁడునెలలు అభయగిరియ స్తూపారామమున నెల్లరకు దర్శనమగునట్లు ప్రదర్శింపఁబడుచుండెడి దనియు నాయన వ్రాసికొనెను.

ఇక్కాలమున కేండీపురమునందుఁ జూడఁదగిన గొప్ప భవనము నాదికాలపు భూపతులు దర్శన మిచ్చుచుండిన చావడి. దీనియందలి స్తంభములు, గొప్ప జాతికఱ్ఱతోఁ జేయఁబడి చిత్రవిచిత్రపుఁ బనితనముగల్గి వింతగొల్పుచుండును. ఇం దిప్పుడు బ్రిటీషు ప్రభుత్వమువా రున్నతన్యాయస్థానము (Supreme Court) నుంచియున్నారు. ఇంక నిప్పట్టణమునఁ జూడఁదగినవి ౧ దుతుజెమునున్నపాలనిర్మిత మిరిశవేతివిహార స్తూపములు. (ఇవి యాతనివైరియగు ఎలేరా (దమ్మిళభూపతి) ను జయించి నిర్మించెనఁట), ౨ ఇసూర్మునియా శిలాగుహా దేవస్థానము (ఇందు బంగారు మలామాచేసిన బుద్ధవిగ్రహము మిక్కిలి పురాతనమైనదియుఁ జక్కని పనితనము గల్గినదియు నున్నది), ౩ దానికిఁ దూర్పున వెస్సదిరియాబుద్ధదేవాలయసముదాయకందరములు, ౪ దుతుజెమునున్నపాలుని సమాధిస్తూపము, ౫ లంకారామము(ఇది క్రీ. వె. యొకటవ శతాబ్దమునాఁటిపని. స్తంభము లమితసుందరములని పేరందినవి), ౬ రత్నప్రాసాదము, ౭ శిథిలమైపోయినరాణీవాసపుభవనము, ౮ ఏనుఁగులస్నానపుఁజెలువు, ౯ అచటనే యున్న ఱాతిపడవ, ౧౦ బుద్ధవిగ్రహాత్రియము, ౧౧ ఉత్తరపు దగోబా (లేక ధాతుగర్భ) స్తూపము (ఇది చాల గొప్పకట్టడము), ౧౨ అభయగిరిఆరామము, ౧౩ ఇచటనే గల రెండు స్నానకుండములు(ఇవి కుత్తంపోకునా యను పేర్లుగలవి), ౧౪ త్రివ్వ బయలు

దేఱదీయఁబడిన రెండు ప్రాఁతరస్తాలు మొదలగునవియై ఉన్నవి.

పురమధ్యమున స్నానతీర్థముగనున్న సరోవరము కేండీ నేలిన కడపటిభూపతియగు శ్రీవిక్రమరాజసింహునిచే నిర్మింపఁబడినది. దీనియందనేకములగు నగాధజలకుండములు కడుశీతలజలములు గల్గియుండును. సగటున సరోవరజలముల కాకారణమునఁ గదలికయుండక యద్దమువలె నిశ్చలమైయుంటఁ జుట్టునుండు నన్నిటియందుఁ బ్రతిఫలించుచుండెడిది. ఆగుండముపై నీఁదుచు నగాధజలముల మునిఁగిపోక బ్రతికి దరిఁజేరినవా రుండరని యచట బలమగువాడుక వ్యాపించియున్నది. సమీపముననేగల మహావేలి గంగయొక్క దరులు మిక్కిలి సుందరమైనవి. పరిసరపర్వత మార్గము లతిరమ్యములు. దరినేయున్న గ్రామమగు కటుగాస్తోఁటకడ మహావేలిగంగయం దేనుఁగులు జలకములాడుకతఁతి నాడుకొనుటఁ జూడముచ్చటయని చెప్పనొప్పు.

పురమున బౌద్ధమతకళాశాలలు పెక్కులున్నవి. అవి భిక్షువులవశమున నున్నవి. కేండీప్రవిన్సు సామంతుల రాజ్యములుగ నున్నది. వారికందఱకు 'రతమాహాత్మీయ' యనుబిరుదము కలదు. వారెల్లరు పేరేహారాఉత్సవము నడుపుదురు. అది లోకప్రసిద్ధమైనది. (పేరేహారాఉత్సవము చూడుఁడు). ఈరతమాహాత్మీయులందఱుఁ గడపటి కేండీభూపతిపైఁ దిరుగుబాటున రాజకీయసభయందు కేండీప్రభుత్వమును బ్రిటీషువారికి వశపఱచిరి.

## పోలోన్నరువ (పులత్తి.)

ఇదియొకప్పుడు సింహళరాజధానిగ నుండిననగరము. దివ్యసౌధములు, సుందరోద్యానవనములు తనయందుఁ గల్గియుండినది. నేఁటికి రెండువందలమంది వసించు పల్లెగ్రామమై, పాడుదిబ్బల

మయమై, బౌద్ధులకు యాత్రాస్థలమై యున్నది. కొలంబోనగరము నుండి కేండీమీఁదుగా ౧౫౦ మైళ్ళు ఇనుపబాటపై నిటకుఁ జేర నగును. దీని యాదినామము పులస్తి. దీని నేలిన భూపతులలోఁ బరాక్రమబాహువు గొప్పవాఁడు గాన దీనిని పరాక్రమబాహు నగర మని బౌద్ధగ్రంథములందు వాడియున్నారు. సింహళుఁడు లంకారాజ్యమంతటిని ఏకచ్ఛత్రాధిపతిగ నేలినవాఁడు.

రైలునుండి దిగి యచ్చటఁ బెరిగినగ్రామమును గడచి రెండున్నరమైళ్ళదూరమందున్న వసతిగృహము (Rest house) న కరుగ బాటయందే భూపతుల వర్షాకాలనివాసపు పాడు తగిలెడిని. ఇది యిటుకలకట్టడము. ఆర్కియాలోజికల్ డిపార్టుమెంటు వారు దీనిని ద్రవ్వి బయలు దేఱదీయకమున్న ఆదికాలపుటిటుక బట్టీలప్రదేశముగఁ దలంపఁబడుచుండెనఁట. మహావంశమను బౌద్ధ గ్రంథమున నీ ప్రాసాద మేడంతస్తులమేడగ వివరింపఁబడినది. అందు వేయిగదు లుండెనఁట. దీనివెనుక నూఱుగజముల దూరమున మంత్రులతో రాజకార్యాలోచన లొనర్చుభవనపుపాడు కొన్ని స్తంభములుమాత్రము మిగిలియున్నది. ఈపరిసరములనేగల దర్శనము లిచ్చుభవనపుపాడును, రాజామాలిగవా యనుచున్నారు. ఇందుఁ జిత్రవిచిత్రపుఁబని యధికము. దానిపునాదిదిమ్మచుట్టు నేనుఁగులయొక్కయు, సింగములయొక్కయు, వామనులయొక్కయు (పొట్టిమనుజులయొక్క) బొమ్మలు చిత్రింపఁబడినవి. వాటిని బరిశీలించిన వాటియందే రెండుబొమ్మలు నొకయాకారమున నుండవు. ఈపరిసరములనే బుద్ధదంత మున్నట్లు చెప్పెడు నింటియానవాలుగ నొకచౌకపు పునాదిదిమ్మ కలదు. అటఁ గొన్నిగజములదూరము ననే కీర్తినిశంకమల్లభూపతి యాస్థానసభామంటపము యొక్క పునాదిదిమ్మయు, స్తంభములును గలవు. ఈతఁడు క్రీ. వె. ౧౧౮౭

నుండి ౧౧౮౬ వఱకుఁ బాలన మొనర్చినవాఁడు. ఈపరిసరములందే యున్నట్లు మహావంశమునఁ జెప్పఁబడిన నందనోద్యానవనమును, నాటకశాలయు బయల్పడకున్నవి. ఇవియన్నియు తోపశేవ యనంబడు సరస్తీరముననే యున్నవి. అది పరాక్రమసముద్రభాగమే కాని వేఱుసరస్సుకాదు. ఇచట కెదురుగ నవ్వలిపశ్చిమతీరమున శీతలమాలిగావా యనంబడు వేసవికాలపు నివాసభవనపుపాడు కలదు. చెఱువుయొక్క యుత్తరపుగట్టున వేఱొకభవనపుఁబాడు కలదు. అందుఁ జిన్నచిన్నగదులు పెక్కులున్నవి. బుద్ధజాతకము (పూర్వజన్మచరిత్ర)లు ప్రభువులు వినుచుండెడి పాఠగృహము లటఁ గలవు. ఇచటికిఁ బదిఫర్లాంగులదూరమందు నగరమును జుట్టినకోట, దక్షిణద్వారపుటానవాళ్ళు కలవు. అట నొకగండశిలపై పరాక్రమబాహునృపతి నిలుచుండినట్లున్న విగ్రహము జీవకళలతోఁ దొలిచి చిత్రింపఁబడినది.

అటకు నూఱుగజములదూరమున పోట్‌గిల్విహారపుఁబాడు కలదు. అందొక వృత్తాకారభవనప్రదేశమును భూపతి కూర్చుండు తావని చూపుచున్నారు. ఆకాలమున బుద్ధదంతము నుంచిన శిలాభవనము దేవాలయాకారముగ నున్నది. అటకు నూఱుగజములలో తూపారామ మున్నది. అది మూఁడంతస్తులుగల గట్టికట్టడము. గోడలమంద మైదడుగు లుండెడిని. ఇందు మిక్కిలి పెద్దదగు బుద్ధవిగ్రహ మిటుకలతోఁ గట్టఁబడినది కలదు. ఇంక నందు వేర్వేఱు జీవితావస్థలుగల బుద్ధవిగ్రహము లున్నవి. డాబాపై నెక్కిచూచినఁ జక్కనిదృశ్యములు కాన్పించుటయేగాక దూరమందున్న రాంకోట్విహార మగపడును. ఉత్తరముగా నిశ్శంకలతామండపాయ స్తూపము, ఆతిగిమ్మయు, దానినిజుట్టి యావరణమును గలవు. ఇది కీర్తినిశ్శంకమల్లనృపాలనిర్మిత మఁట. దీని

స్తంభములపని చాల చక్కనిది. దానికిఁ దూర్పుగ వాటాడాగి యనంబడు (Relic house) గుండ్రనియిల్లు కలదు. ఇది పరాక్రమబాహునిర్మిత మని మహావంశమునందుఁ గలదు. దాని గోడపై కీర్తినిశంకభూపాలనిర్మిత మని శాసన మున్నది.

ఎత్తైనను సుందరమగు కట్టడము. నాలుగుద్వారములందును బుద్ధవిగ్రహము లున్నవి. అవి యిరువదియెన్మిదిబుద్ధులలోఁ గడపటి నలుగురుగాఁ బరిశీలకులు పోల్చుచున్నారు. ఇది బౌద్ధులయాత్రాస్థలముగ నున్నది. ఎదురుగఁ గొంచెముదూరమున హేటాడగిరి (Sixty relics) భవన మున్నది. దీనియెదుటనున్న బుద్ధవిగ్రహము కాంబోడియాదేశపుఁ బనితనమును బ్రదర్శించుచున్న దని పరిశీలకు లనుచున్నారు. అటకుఁ గొంతదూరమున గాల్పోతా యనంబడు ఱాతిపుస్తక మున్నది. అందలి శిలాశాసనములు కీర్తినిశంకమల్లునిజీవచరిత్రమును దెల్పెడిని. ఆపరిసరములనే యేడంతస్తులుగల సాత్మహల్ప్రాసాద యనుకట్టడము కలదు. దానినిగూర్చి యేమియుఁ దెలియదు.

ఈసాత్మహల్ప్రాసాదమున కీశాన్యదిశగా నూఱుగజముల దూరమున నొకస్తూపమును, నింకఁ గొంచెముదూరమున నొక సుందరమైనదియుఁ, జక్కనిపనితనముగల్గినదియు నగు శివాలయ మున్నది. ఇటీవల ఆర్కియాలోజికల్ డిపార్టుమెంటువారు దానిని మరమ్మతుచేయించి యున్నారు. అటనుండి యడవిగుండా నడుచుచు వేఱొకపాడుపడిన శివాలయమును గడచి రాంకోటవిహారమున కేగనగును. అట నొకస్తూపముపరాక్రమబాహుని ప్రియరాజ్ఞియగు రూపావతీదేవి కట్టించెనందురు.

కొందఱుపరిశీలకులు రూపన్వెలిశేయవిహారమునకుఁ గర్త కీర్తినిశంకమల్ల నరపాలుఁ డనియెదరు. దానికడనే పురమును

జుట్టిన కోటద్వారము వేఱొకటి కలదు. రాంకోటవిహారపరిసరము లందే జేతవనారామపుఁ (మఠము) బాడు కానవచ్చును. అందలి లంకాతిలక మనుపేరుగల బుద్ధదేవస్థానము నిటీవల నార్కియాలోజికల్ డిపార్టుమెంటువారు బాగుచేయించియున్నారు. ఈప్రాంత ముననే క్షీరవిహార (క్షీరవిహారమేమొ) ముండెడిది. అది తెల్లని రంగుగల భవన మగుట నాఁపఁబడెనందురు.

## గాల్విహారము.

కొంతదూర ముత్తరముగా నడిచిన గాల్విహారము కలదు. ఇచట పెద్దగండశిల చెక్కఁబడి చక్కనిపనితనమున విరాజిల్లుచున్నది. దీని కింకను గలుగల్విహార మనియు, నుత్తరారామ మనియు వాడుకనామము లున్నవి. ఈపేరులు మహావంశ మను బౌద్ధగ్రంథమున వాడఁబడియున్నవి. శిల కుత్తరముగా సింహాసనాసీనుఁడైన బుద్ధభగవానునివిగ్రహము ౧౩ అడుగులయెత్తుకలది కలదు. ఇట నాగండశిలయందొకగుహ (గది) తొలువఁబడినది. దానినఁనుమగఁ దొమ్మిదడుగుల తొమ్మిదంగుళములయెత్తుగల బుద్ధవిగ్రహము చెక్కఁబడినది. ఇవి యన్నియు నొకచేతాలితో నా గండశిలయందుఁ దొలిచియు, వదలివేయఁబడినదానిని జెక్కియుఁ బరస్థలములఁ దీసివైచి రచించిన పనితనమని యెఱుంగునది.

ఉత్తరదిశ నాగండశిలప్రక్కభాగమును నునువుగఁ జెక్కియందు శిలాశాసనపు టక్కరములు పాలీభాషయందుఁ గూర్చిరి. ఆశాసనమందు భూపతి బౌద్ధమతమున కొనర్చినసేవలు వివరింపఁబడియున్నవి. బౌద్ధభిక్షుస ఘాంగీకారమున నాభూపతియాశాసనము నటఁ జెక్కించెనందురు. ఆప్రాతియందే బుద్ధభగవానునిశిష్యుఁడై యనుచరుఁడై, యాయనకు సేవ లొనర్చిన ఆనందుని విగ్రహము చిత్రింపఁబడియున్నది. ఇది చక్కనిపనితనమును బ్రదర్శించెడిని.

గాల్వీహారమునుండి యాఱుఫర్లాంగులదూరమున పద్మస్నాన మను దిగుడుబావి కలదు. దానినీటికడకుఁ గ్రిందికి దిగు శిలాసోపానములు, తామరపూవునందలి రేకులవంటి యాకారము గల్గియున్నవి. పైనుండి చూచువారికి మెట్లన్నియుఁగలసి వికసించిన తామరపూవువంటి యాకారము గల్గియుండును. దానికిఁ దూర్పున నఱమైలుదూరమున నొకచిన్నస్తూపమును, పరాక్రమబాహునృపతి నిర్మింపఁజేసెనందురు. దీనికిఁ దమిళమహాశేయ యని యాయనయే పేరిడెనఁట. ఆయనకు యుద్ధములందుఁ బట్టువడిన యఱవ (దమిళ్ళు) లచే నది కట్టింపఁబడుటనేమో దానియందుఁ బరిశీలించిన ద్రావిడపుఁబనితనము కాన్పింపకపోదు. క్రీ. వె. ౭౬౯ వఱకు దీనిచరిత్ర మేమియుఁ గానరాదు.

## సామంతకూటము (Adam's Peak)

ఇది సింహళద్వీప మంతటను చేరందిన పర్వతశిఖరము. సుప్రసిద్ధయాత్రాస్థలము. సముద్రమున నోడలలోనరుగువారికిఁ బెక్కుమైళ్ళదూరముదనుక నొకగుఱుతుగఁ గన్పట్టుచుండునది. దీనియెత్తు సముద్రపునీటిమట్టముపై ౭,౩౬౦ అడుగులు. ఈద్వీపమున నెక్కువయెత్తగు పర్వతశిఖరము పెద్రోతలగల. ఇది సముద్రపు నీటిపై ౮,౨౯౦ అడుగుల యెత్తు. తరువాతఁ జెప్పఁదగిన దీసామంతకూటమే.

సామంతకూటపర్వతమును జుట్టియే గాక పరిసరపర్వతములందుసహా దట్టమగుపొగమంచు క్రమ్మి దృశ్యమును మఱుఁగుపఱచుచు, బలమగు సముద్రపుగాలులచే నది తఱుమఁబడుచుంటఁ దిరుగ దృశ్యములను గన్పడఁజేయుచు, దూరమునుండి మోటారు బండ్లలో నరుగుచున్నవారికి దాఁగుడుమూఁతలాడుచున్నట్లు కాన

నగుచుండును. దీని నెక్కుటకు ౧ రత్నపురిమార్గము, ౨ హేటన్ మాస్కేలియామార్గము ననురెండుముఖ్యమార్గములు కలవు.

రత్నపురిమార్గ మిరువదిమైళ్ళదూర ముండును. మార్గము మిగుల కష్టతరమైనది. దారియం దొక్కొకతావున నినుపనిచ్చెనలపై నెక్కుచు వ్రేలాడఁదీయఁబడిన గొలుసులు పట్టుకొని పోవలసియుండును. అలగ్జాండరు ది గ్రేటు కాలమున వేయఁబడినయినుప గొలుసులు త్రుప్పుపట్టినట్లు చూపుచుందురు. మార్గమున జలధారలు, గండశిలలు, అడవితుప్పలు, ఱాళ్ళకడలనుండి యెక్కి నడుచు దారులు ననేకములుండి గమనము కష్టముగనుండెడిని. కడపటి కొన్నివందలయడుగు లెక్కుట మిక్కిలియాయాసకరమై దనరెడిని. గొలుసులుపట్టుకొని మధ్యమధ్య నాఁగి యలసటఁదీర్చుకొనుచు, నిలుచుండియే సేదదీర్చుకొనుచు నరుగవలసియుండును. పైభాగములనుండి క్రిందికిఁజూచుట భయంకరముగ నుండును గాన రాత్రిలం దీకొండ నెక్కుచుందురు. మేఘములు తమకుఁ గ్రింది భాగములనుంట పగ లెక్కువారలకుఁ గానఁనగును. మార్గమున నొకతావునఁ గొండప్రక్కనున్న పగులును(బీటను) బుద్ధభగవానుఁడాదిని నిటఁ దనకట్టుబట్టలు కుట్టుకొనుచు నాసూదితో నేలను గీచినయానవా లందురు. దీనినిదాఁటి భూతపిశాచాదులు ముందునకుఁ బోఁజాలవందురు. ఇట్లే మార్గమందున్న జలధారలు, సెలయేళ్ళు మొదలగువాటినిగూర్చి కథ లనేకములు తెల్పుచున్నారు. ఇవియన్నియు బౌద్ధమతసంబంధములుగనే యున్నవి. ఇదియే యాదికాలమునుండియు నుండినమార్గము గానఁ బవిత్రవంత మందురు. ఇది వెడలుపులేని యిఱుకుమార్గముగ నున్నది. సంవత్సరముపొడవున నీమార్గముగుండా యాత్రికులు నడుచుచుందురు. ఇక్లేగుట నధికఫలప్రద మను బౌద్ధభిక్షువులును గలరు.

రెండవదియగు హేటర్ మాస్కేలియామార్గ మంతకష్ట మనిపింపదు. కొండదరికిఁ జేరుదనుక మోటారులుపోవుబాటకలదు. ఈమార్గమునం దేటేట ఏప్రిల్, మే మాసములం దధికముగ యాత్రికు లరుగుచుందురు. ముఖ్యముగ వర్షములులేనికాలమం దీమార్గ మధికముగ వాడుకయం దుండును. రాత్రియందు భోజనము లైనపిదప లాంతరులతో బయలువెడలి తెల్లవారువఱకుఁ గొండపై కెక్కుదురు. హేటర్ మాస్కేలియాబాట కొండదరికిఁ జేరఁ బదునాల్గుమైళ్ళుండును. పర్వతపరిసరారణ్యమునకు Peak wilderness అనివాడుచున్నారు. యాత్రికులు స్త్రీలు, బాలురు, వృద్ధులుకూడఁ బురుషులతోనుండి యుత్సాహపూరితులై 'సాధు, సాధు, సాధు' అని యఱచుచుంట వినోదముగ నుండెడిని.

సామంతకూటమును హిందువులు, బౌద్ధులు, మహమ్మదీయులు, క్రైస్తవులు గూడఁ బవిత్రస్థలిగా నెంచుదురు. ఇది బౌద్ధభిక్షువులవశమందున్న పవిత్రక్షేత్రము. పర్వతశిఖరమున నొకపెద్దగండశిలపై నాలుగడుగులపొడవున మనుష్యపాదమును బోలి యించుకపల్లమగు నానవాలు కలదు. దానికి శ్రీపాద మని పేరు. దీనిపై నొకపాటిగృహము కలదు. అదియే యచటిదేవస్థానముగ నున్నది. దానినే బుద్ధపాద మని బౌద్ధులును, శివపాద మని హిందువులగు నఱవలును, ఆదిపురుషుఁడగు ఆదాముపాద మని మహమ్మదీయులును, సెంటుపీటరుపాదమని క్రైస్తవులును భక్తితో గారవించుచున్నారు. బౌద్ధులగు సింహళులు, సయాందేశస్థులు, బర్మావారు, టిబెట్టుదేశస్థులు నొకటేమాటగ నిది బుద్ధపాద మనియుఁ, బవిత్రస్థలి యనియు నందురు. వారే శ్రీపాద మని పేరిడియుందురు. హిందువులగు నఱవలు శివపాదపవిత్రస్థలి యనెదరు. మహమ్మదీయులెల్లతెగలవారును స్వర్గమందలి తోటఁ

నుండి ఆదాముహవ్వలు వేఱుసేయఁబడి తఱిమివేయఁబడినతఱి ఆదా మిటఁ జేరి ఒకకేపాదమున నిలిచి వందలాదిగవత్సరము లిటఁ దపమొనర్ప జిబ్రేలుమహాపవిత్రమధుఁడు కనికరించి కల్గించుకొని ఆదాము నోదార్చి సింహళము నాతని కొసఁగఁ జేసె ననియు, ఆపాదనుజాడయే యీపవిత్రస్థలి యనియు నందురు. క్రైస్తవులు సెంటుతోమా సుబోధకునిపాద మందురు.

ఈ సామంతకూటపర్వతపరిసరములు తేయాకుసీమయం దున్నను, నిచటి తేయాకు మిగులరుచికరమని పేరందియున్నను, బర్వతపరిసరప్రాంత మంతయు వర్ష మధికముగాఁ గురియుసీమ. ఏటేట రెండువందలయంగుళములవానకుఁ బైఁగాఁ గురియుచుండు నని లెక్కించియున్నారు. చెట్లుచేమ లధికముగాఁ బెరిఁగియున్నవి. పర్వతజలధారలు, సెలయేళ్ళు, జలపాతములు లెక్కకుమీఱి యున్నవి. పర్వతపరిసరసీమలు పల్లపుఁబ్రదేశములు. అట లేచు నీటియావిరి యధికము. అది దట్టమై పొగమంచుగ నేర్పడి సూర్యోదయకాలమునఁ బశ్చిమదిశనుండు మంచుపై సామంతకూటశిఖరముయొక్క నీడ స్పష్టముగాఁ గన్పట్టుచుఁ బండ్రెండు నిముసములలోఁ బలచబడినట్లు మాయమై తిరుగ నచిరకాలముననే సూర్యబింబ మించుక పైకిరాఁగాఁ బర్వతపంక్తియొక్క నీడ స్పష్టమై కన్పట్టి తిరుగ నచిరకాలముననే యదృశ్యమయ్యెడిని. ఇత్తఱిఁ బర్వతపంక్తియొక్కనీడ యొకటిగను, శిఖరచ్ఛాయ వేఱొకటిగను రెండుదృశ్యము లని యెఱుఁగునది.

## జాఫ్నా

ఇది జాఫ్నాద్వీపకల్పమున సింహళమున కుత్తరభాగమున నున్నపురము. జాఫ్నాద్వీపకల్పమునకు దక్షిణముగఁ దక్కిన ద్వీప

మును వేఱుచేయుచున్న సముద్రపు నీటికాలువకు ఎలిఫెంటుపేస్ అనిపేరిడిఉన్నారు. ఇది సముద్రపుచెలక. ఇనుపదారిబండ్లునడుచుటకు దీనిపై వంతెన మిక్కిలిపొడవైనది నిర్మింపఁబడియున్నది. ఇచట వర్షములు సరిగాఁ బడకుండును. ద్వీపకల్ప మంతటను వరిపొల ములు, పండ్లతోఁటలు విస్తారముగ నున్నవి. వ్యవసాయములకు నూతులనుండి నీరెత్తి పాఱింతురు. రైతు లధికశ్రమచేసి నీరిత్తురు. అచ్చటచ్చటఁ గొబ్బరితోఁటలు కలవు. తాటితోఁట లధికముగాఁ గలవు. ఈసీమయందుఁ దాటిచెట్లవలన నుపయోగములు మెండు. హిందువులకుఁ బిదప క్రైస్తవమతస్థు లధికముగాఁ గానఁబడు చున్నారు. ఎట్లయినను ద్వీపకల్పమున సఱవ లధికము. భూమి యిసుకగను, శీతోష్ణస్థితి Hot and dry గను నుండును. హిందువులందు శివభక్తి యధికము. పరమేశ్వరుని పరమశివన్ అనెదరు. ఇంచుమించు దక్షిణఇండియా దేశమునుబోలి గానవచ్చె డిని. ముఖ్యముగ దేవాలయములు, గోపురములు సఱవదేశము నందువలెనే యుండి యెక్కువగాఁ గానఁబడుచుండును. పిల్లెయార్ (విఘ్నేశ్వరుఁడు), కందసామి (స్కందస్వామి), సుబ్రహ్మణ్య భక్తి ప్రజలయం దధికముగాఁ గలదు. జాఫ్నాసముద్రతీరమం దున్న కీరమలైదేవస్థానమును, మావిడ్డపురస్కందస్వామి దేవస్థాన మును నీసందర్భమునఁ జెప్పఁదగినవి.

ఎలిఫెంటు Pass ఊలుబాడిగల మెరకగానుండు సముద్రపు చెలక. కావున దీనియం దేనుఁగులు దాఁటబోయి బురదయందుఁ గూరుకొని చనిపోవుట నీపే రయ్యెనఁట.

ఇట నఱవలశత్రువులగు సింహళులు దండయాత్రరాకుండఁ గనిపెట్టుటకుఁ జిన్నకోట, చెలకను దాఁటుతావునఁ గట్టఁబడినది. (18 శకా. డచ్చివారికాలము) వర్షాకాలమున నిందుఁ బకుల వేఁటకాలము.

భూమి కొంతయెత్తుమట్టి. తాటికొబ్బరిచెట్లు కొంతవింతగా నుండెడిని. మఱ్ఱి, రావి, జువ్విచెట్ల నడుమఁబుట్టిన తాటిచెట్లు తఱచుగాఁ గలవు. వీటికి Married trees అనెదరు. మామిడి తోఁట లధికము.

జాఫ్నాలో డచ్చివారినాఁటి పెద్దకోట కలదు. క్రీ. వె. 18 శతాబ్దప్రారంభమున దీనిచుట్టు వెడలుపైన కందక మున్నది. దానిని గట్టినఱాళ్ళు ఇచటికి 11 మైళ్ళ దూరమందున్న కంకెశన్ తురాయినుండి మనుష్యులఅంచీలపైఁ దెప్పింపఁబడినవనిచెప్పుదురు.

పుత్తూరునుయ్యి నైసర్గికపునూయి. త్రవ్వఁబడ లేదఁట. నీరు చాలలోఁతు. పైనీరు తియ్యగనుండి లోఁతునీ రుప్పగనుంట సముద్రసంబంధము కలదు. చెలకయుత్తరపుకొన నొకఱాతిపై నొకకోట Guard కట్టఁబడినది. అందిప్పుడు Plague రోగము సోఁకినవారికి క్వారంటైను నుంచియున్నారు. ఇచట మదరాసు, కాటమార్గాలు చేఁపలుపట్టుతావులు. టపా Southern India.

## త్రింకోమలి - ఓడరేవు.

తూర్పుతీరమందున్న రేవుపట్టణము. ఇనుపబాటకడ నున్నది. కొలంబోనుండి కేండీ, దంబుల్లాలమీఁదుగా ౧౮౧ మైళ్లును, కేండీనుండి ౧౦౯ మైళ్లును, అనూరాధపురమునుండి హెూరావుపోతనామీఁదుగా ౬౭ మైళ్లును దూరము. ఇది క్రీ. ము. ౨౫౦౦ సంవత్సరమునాఁటికే రేవుగ నుండెను. కాని యిప్పటిపే రప్పు డుండలేదు. ఇట సముద్రములోనికిఁ జొచ్చుకొనియున్నకొండకు తిరుక్కోనాథమలై యనిపేరు. దానిపై తిరుక్కోనాథుని దేవాలయ ముండెనఁట. దాని నప్పటి యధికారులగు పోర్చుగీసువారు మత గౌరవవిహీనులై రేవుగోడలు కట్టుటకు ఱాళ్లకై పడఁగొట్టి కొంపో

వుటయు, నంతటితో నాఁగళ పలుకుటకు నోరుతిరుగక కాఁబోలు ఏపోర్చుగీసుదొరగారో త్రింకోమలి యని నవీననామ మిడిన ట్లుచ్చరింపసాఁగెనఁట. నేఁటికిని నాపేరే వాడుచున్నారు. కాని కోనేశ్వరభక్తి మనుష్యులకు వీడక హిందువులు, బౌద్ధులునుగూడఁ బ్రతి సోమశుక్రవారములం దచటి కేఁగుచు నాదేవుని బూజించుచునేయున్నారు. అటనే ఫ్రెడరిక్ దుర్గముకట్టినది. వారేకాఁబోలును అటకు నాల్గుమైళ్లదూరమున కన్నియా గ్రామముకడ నీదేవస్థానమున కనుబంధముగ వేఁడినీళ్లయూటలు స్నానతీర్థములై యున్నవి. వాటియందలి స్నానము రోగములు కుదుర్చునందురు.

ఇచటిరేవగు హార్బరు నైసర్గికమై యచ్చెరువుగొల్పెడిని. భూమియం దడఁగి కొలఁదిగమాత్రము పైకిఁ దలసూపిన రెండు వరుసలగుట్టలు తీరమునుండి సముద్రములోనికిఁ జొచ్చుకొనిపోవుచు నడుమను సింధుశాఖను జేసి విశాలజలప్రదేశపుహార్బరును వ్యయమక్కఱలేకయే కుదిర్చినవి. ఈ ప్రాంతముల నైరృతిదిశనుండి యపాయకరమగు వర్షపుగాలులు వీచి యోడలకు బాధగల్గించుచు దరికిఁ జేరనీయకుండును. ఈ గుట్టలవరుస లీశాన్యదిశనేయుండి మధ్యనున్న జలమున కాతొందర గలుగనీయక శాంతజలములుగా నుంచును. కాన నోడ లతిసౌఖ్యమున దరికిఁజేరును. రేవునుజుట్టి డచ్చివారినాఁడు కోటలుకట్టి భద్రపఱచిరి. ఇటకు దక్షిణముగా డెబ్బదిమైళ్ళదూరమున బట్టికాలోవా రేవున్నది. (చూడుఁడు) త్రింకోమలిహార్బరు ముఖముకడ Ostenburg దుర్గమును Fort Frederick దుర్గమును గండశిలలపై నిర్మింపఁబడినవి కలవు. సైన్యములు అందు లేవు.

డచ్చివారిపరిపాలనకాలమున నిచట కమేండెంటు ఉద్యోగమొనర్చిన సేనానికూఁతురు Francina Van Reede అను

నామె యొకఁడచ్చియుద్యోగిపై ననురాగ మూని పరిణయముగాఁ గోరెనఁట. వారు నిర్ధారణ (Betrothal) మొనర్చుకొనిరఁట. అచిరకాలముననే యాతఁ డొనర్పవలసిన విదేశవాససేవా కాలములు పరిపూర్తియగుట స్వదేశమున కరుగుతఱి నీమెతో నేర్పఱచుకొనిన వివాహసంబంధమును ద్రెంపుకొని యోడ నెక్కె నఁట. ఆకుటిలవర్తనుఁ డరిగినయోడ సముద్రపు లోబారున కరుగగనే యా వంచితురాలు కొండపైనుండి సముద్రమునఁబడి మృతినొందెనఁట. ఆసంగతి ఫ్రెడరిక్కుదుర్గమున నెత్తగుతావున డచ్చిభాషయందు శిలాశాసన మమర్పఁబడియున్నది.

పరిసరతీరములఁ జిత్రవిచిత్రవర్ణములగు సముద్రపుఁ జిప్పలు, గుల్లలు, పట్టు బొమ్మలుగ నంటించి యమ్ముదురు. పెద్ద పెద్ద ఓయస్టరుచిప్ప లిచట దొరకెడిని. అవి ముత్తెపుఁజిప్పల యాకారము, వన్నె, స్వచ్ఛత గల్గి రంగుతోఁగూడి యుండెడిని.

## నూఆరాఎలియా (లేక) నువారాఎలియా.

ఇది సింహళములో సుప్రసిద్ధసమశీతోష్ణస్థలము. గవర్న మెంటుయొక్క వేసవికాలనివాసము. కొలంబో నగరమునుండి యినుపబాటను ౧౧౮ మైళ్లును, నాటుదారిని జనిగెతెన్నె కనుమ మార్గము, హేటనుపురముఁమీఁదుగా ౧౦౬ మైళ్ల దూరమునం దున్నది. కేండీపురమునుండి రాంబోడాకనుమ మార్గమున ౪౮ మైళ్లు. బాదుల్లానుండి 3౫ మైళ్లు. బండారవేలానుండి ౨౯ మైళ్లు. హాక్‌గాలానుండి యాఱుమైళ్లు దూరము.

ఇట కరుగువారు తలవాకెలిమీఁదుగా నానూఓయాసంధి కడ నేరోగేజిచిన్నలైనుపై రాగల్లా కరుగుదెసకుఁ బయనమొన ర్చుచుఁ బోవలెను. తలవాకెలి దాఁటినతోడనే గొప్ప యినుప

బాటచిత్రము, సోడావాటరుబాటిల్ కర్వ్ (Soda water bottle Curve) ఒకటి రచింపఁబడినది. ముప్పాతికగంటప్రయాణములోఁ దొంబదిమైళ్లయెత్తున కెక్కి వంపుతిరుగును. ఆవంపు రెండువందల యడుగులదూరము వంగిన రెండులైనుల నడుమ నుండును. కడ కొకమైలుదూర మరుగఁవఅకు నాఱుమైళ్లపొడవులైను వంకరటింకర లుగ నడువవలసియుండును. తిన్నఁగాఁ జూచినయెడల (అడ్డముగా) దూర మొకమైలుమాత్రమే ప్రయాణమున కయ్యెడిని. కాని తొమ్మిదిసార్లు దారియం దడ్డముగనున్న యినుపబాటను దాఁట వలసియుండును. నానుఓయా రాగల్లాచిన్నలైను పందొమ్మిదిమైళ్ల పొడవు కలది. దారి కడు సుందరమైనది.

పెడ్రోతలగల (పర్వత) శిఖరము సముద్రపు నీటిమట్ట ముపై ౮౨౯౬ అడుగులయెత్తు కలది. నూవారాఎలియాపట్టణము ప్రక్కగనేయుండి దానిని జూచుచుండును. శిఖరముపై పరికళ్లమును బోలిన తెల్లరాతితా వుండుట నాపే రీశిఖరమున కిడిరి. ఇది సింహళమున నెక్కువ యెత్తగు పర్వతశిఖరము.

నూఆరాఎలియా యింగ్లాండు దేశమందలి పురమునుబోలి యుండునని పెక్కండ్రు వ్రాసియున్నారు. ఇట గోల్ఫులింక్సు సుప్రసిద్ధమైనవి కలవు. సముద్రపు నీటిమట్టముపై ౬౨౦౦ అడు గుల యెత్తుగల ప్రదేశము. పురమున వేర్వే ఱెత్తులందు పీలగు తావులఁ గృతకసరోవరములు, వాటినిజుట్టి చక్కనిబాటలు, వాటి కిరుదెసల నీడనిచ్చు ఛాయావృతములు చూడఁదగినవి కలవు. ఊరికిఁ బశ్చిమదిశను రాంబోడా (Pass) కనుమమార్గము కలదు. అది కేండీ కరుగుబాట. వంకరటింకరలుగ పురపరిసరములనే దిగుట కారంభించి పండ్రెండుమైళ్లలో ౩౫౦౦ అడుగులు దిగిపోవును. ప్రతినిమిషము దృశ్యము మాఱిపోవుచు దిగువదేశమునను,

తేయాకుతోఁటలందునను బనిచేయు మనుష్యులు చిన్న బొమ్మల వలె నగపడుచుందురు. దారియందు ట్విన్ ఫాల్సు (Twin falls) జలపాతము కలదు. ఈనాఁటిబాట హేటన్‌నుండి తలవాకెలికి క్వీన్సుబెర్రిగేప్ గుండా పోవుచున్నది.

నూవారాఎలియా ప్రాక్పరిసరములఁగల పురాతనపు చీనా తేయాకుతోఁటప్రక్కను పీఠభూమికి దిగువనే సీతాఎలియా (సీతా దేవిని రావణభూపతి నిర్బంధమున నుంచినతావు) కలదు. ఈపరిసర ప్రదేశములకు ఎల్కుడౌన్సు (Elkdowns) అనిపేరు. (సీతా ఎలియా చూ.) ఎల్కుడౌన్సున కవ్వల (నూవారాఎలియాపర్వ మునకుఁ దూర్పుభాగమంతయు) ఉవాపటానులు (Uvadowns) వ్యాపించియున్నవి. అందు బాదుల్లా (Tea centre) పుర మున్నది. ఇంకను నింపు మఠేలు (పురము), గంపోలా, నువాలా పిటియాలు తేయాకువర్తకస్థానములే.

## మహింతల్ పర్వతము

ఇది యాత్రాస్థలము. అనూరాధపురమునుండి యెన్మిది మైళ్ళదూరమునందున్న వేయియడుగుల యెత్తుగల పర్వతము. దీని నెక్కుటకు రెండువేలశిలాసోపానము లున్నవి. మహింతల్ అనిన మహిందుని తావని యర్థము. మహిందుఁడు సుప్రసిద్ధబౌద్ధమత వ్యాపకుఁడగు నశోకచక్రవర్తిసుతుఁడు. యువరాజుగనుండి రాజ్య కాంతను వీడి బౌద్ధమతబోధకుఁడై, బౌద్ధభిక్షుకుఁడై లంకారాజ్య ము (సింహళము) న కేతెంచినవాఁడు. భరతదేశమునం దాయ నకుఁ దండ్రిపెట్టినపేరు మహేంద్రుఁడుగానోపు. పాళీభాషయందు సింహళదేశపు మార్పులకు లోనై "మహిందో" యాయెను.

క్రీ. ము. ౨౪౭ సంవత్సరములనాఁడు తిస్సా (బహుశః త్రిలోకాశ్రయశబ్దసంబంధము గానోపు.) యను పేరుగల భూపతి

రాజ్యపాలన మొనర్చుచుండెనఁట. ఆయన సింహళుఁడు. ఒకనాఁడు వేఁటాడుచుండనొక లేడినిజూచి వెంటాడియరుగుచుండ మిస్సాపర్వత చరియలందు బౌద్ధభిక్షువగు మహింద్రుఁడును, ఆర్ష రనుచరశిష్య వర్గమును గన్పించి "తిస్సామహీపాల ! నీకు స్వాగత మిట రమ్మని పిలువ భూపతి తనమృగయావినోదగమనముమాని వారికడ కరిగి వారిబోధనలను వినుచు నెట్టకేలకు మహిందో దేశికుని శిష్యుఁడై బౌద్ధుఁడాయెను. అది పౌర్ణమిదిన మని చెప్పఁబడినది. ఇత్తా వప్పటి నుండియేమో మహింతల్ పర్వతమని పేరందెను. అప్పుడు రాజ థాని యనూరాధపురమే. ఆభూపతి బౌద్ధుఁడైన సంగతి విని ప్రజలు బౌద్ధులు కాసాఁగిరఁట. అట నత్తఱి నలువదివేలసింహ ళులు బౌద్ధులై బుద్ధబోధసంఘములందు శరణ్యముఁ బడసిరఁట. ఈయాత్రాస్థల మరణ్యమునం దున్నది.

కొండక్రింద నొక వైద్యశాల పాడై యున్నది కాననగును. అందొకపడవనుబోలిన ఱాతితొట్టె కలదు. అందానాఁడు రోగుల కౌషధములు కల్పినసీటియందు స్నానము లాచరింపఁజేయుచుండి రందురు. అక్కాలపుభూపతులు వైద్యవిద్యావిశారదులై ధర్మ వైద్య మొనర్చువారఁట. అట్టివారిలో క్రీ. వె. ౩౮౧, ౩౭౦ బుద్ధ దాసుఁడను భూపతి యగ్రేసరుఁడఁట.

మహింతల్ పర్వతమునకు మిస్సాపర్వత మనిపేరు. దాని నెక్కుటయందుఁ గొంతదూరమున నొకబౌద్ధవిహారము పాడైనది కన్పడును. ద్వారమున కిరుదెసలందు రెండు శిలాఫలకశాసనములు కలవు. అందు బౌద్ధభిక్షువులవిధులు, నిషేధములు, ఆహ్నికకృత్య ములు వివరింపఁబడినవి. మఱికొన్ని సోపానము లెక్కినఁ గుడి వైపున కొకబాట "సింహస్నానము" కడకుఁ జేర్చును. అట నెత్తగుతావున నుంకించిదూఁకుటకు సంసిద్ధమైయున్న ఱాతిసింహము

నోటనుండి జలధారపడుచుండ నందు స్నాన మాచరించుచుండిరఁట. అటనుండిమరలి మఱికొన్ని మెట్లెక్కఁగనే "పోకునా" జలనిలయ స్నాన మున్నది. అట నాఱడుగుల పొడవుగల మైదుపడగల నాగము ఱాతియందుఁ జెక్కఁబడుట నీపేరయ్యెనఁట.

తిరుగ సోపానములకు మరలి, తిరుగ మెట్లెక్కుటయం దచిరకాలముననే ప్రధానపవిత్రస్థలిఁ జేరనగును. అటనే మహిం దునిచే బోధింపఁబడి తిస్సానృపాలుఁడు బౌద్ధమత స్వీకార మొనర్చినతావు. అదియే సిదప మహిందుని శ్మశానమును నై యున్నది. తరువాత నత్తావున నొకగుండ్రనిభవనము నిర్మింపఁబడి వెలుపలఁ జుట్టును స్తంభములచే నలంకరింపఁబడినది కలదు. దాని నిటీవల జక్కఁగ మరమ్మతుచేయించియున్నారు. దాని కెడమ ప్రక్క నొకమెత్తగుశిలాతలమున నొకస్తూపమును గట్టి యాం బాయనయస్తుల నుంచియున్నారు. ఆప్రాంతముననే కొంతదిగువగ నామహోత్ముఁడు వసించినగుహను జూపుచున్నారు. ఉత్సవములం దిటకు వేనవేలుజను లేతెతురఁట. ఈ ప్రాంతముల గ్రామములు లేవు. కొండలు బౌద్ధభిక్షువు లిందుఁ గాననగుచుందురు. కొండ దిగువను కలూదియాపోకానసరస్సును, రాజగిరిలేనావిహారమును గలవు. (చూడుఁడు).

## రొహూన (పురము)

ఇది యనూరాధపురమునకు దక్షిణముగాఁ గొంతదూర మునం దెచ్చటనో మహావేలిగంగానదీతీరమున దాఁగుటకు భద్ర మైన స్థలమఁట. క్రీ.ము. రెండవశతాబ్దమాదిగ దక్షిణఇండియా దేశమునుండి యఱవలు (దమ్మిళులు) అదేపనిగ సింహళముపై దాడివెడలుచు ననూరాధపుర మాక్రమించుచుండఁ గొందఱు సింహళభూపతులు రొహూన కరిగి దాఁగి యట భద్రముగనుండి

చెదరిన సైన్యబలములఁ దిరుగఁ గూర్చుకొని దాడివెడలి శత్రువుల
నోడించి యనూరాధపురరాజధానిని దిరుగఁ గైకొనెడివారఁట.
అట్లొకతఱి క్రీ. ము. ౧౫౦ సంవత్సరముల ప్రాంతమున కాకవన్న
తిస్సా యనుపేరుగలనృపతి యటఁ గొంతకాలము నిలువనయ్యె
నఁట. ఒకపాటిపడవ గాలికిఁ గొట్టుకొనుచు నరుదెంచి యటఁ
దీరమునకుఁ జేరెనఁట. అందుండి యొకనారీరత్నము దరికిదిగి దీన
వదనయై ఖిన్నతతోఁ దాను కెలానియాసామంతరాజపుత్రి ననియు,
నాతనిక్రూరకార్యములకుఁ గినిసి దేవత లాతనిరాజ్యమం దొక
భాగము సముద్రగామియగున ట్లొనర్ప నాతఁడు ఖిన్నుఁడై
వయసునందిన తనయనుంగుపుత్రికను బలియీయ నుద్యుక్తుఁడై
చంపఁజాలక యీయోడయందు సేవకురాండ్రను సైత మెక్కించి
సముద్రపులో బారున విడిచి బలినర్పించెను. కాని దైవవిధి యిట్లుండ
సముద్రమునఁ బడవ కేయపాయము జరుగక వాయువశమున నీ
తీరము చేరుటతో భూనాథునియెదుటనే యోడదిగుట సంభవించెను.
కావున "నోభూనాథా! మమ్ము నీరాజ్యముగుండా పోనిచ్చిన
మావిధి మమ్ముఁ దీసికొనిపోయినరీతికి లోఁబడి సామంతకూట
శిఖరమున కెక్కి శ్రీ (బుద్ధ) పాదపవిత్రస్థలిని బూజించి మమ్మావ
రించియున్న దుర్దోషభరమును బాపికొందు" మనెనఁట. భూనాథుఁ
డగు కాకవన్నతిస్సా వెఱగందియు నారాకొమరితపై బద్ధాను
రాగుఁడై "రాజపుత్రీ! నీయాత్రల నెఱపి నీమనస్సంకల్ప మీడేర్ప
బద్ధుఁడను. నీయాజ్ఞమేరకు మెలంగుచుండ వ్రతముఁ బూనెదను.
నన్నన్యునిగ భావింపక నాకుఁ బట్టపురాణివై ధన్యునిగా నొనర్పు
మని వేఁడ నాసుందరియు నియ్యకొనెనఁట. ఆమెకు విహారమహా
దేవియని పేరు. ఆయిందువదన నిల్లాలుగఁ బడసి సుఖాబ్ధి నోల
లాడుచు నాకాకవన్నతిస్సానృపాలుఁడు తిస్సామహారామమును

గట్టించి జెమును, తిస్సా లను పేరుగల్గిన యిర్వురుసుతులను బడసె నఁట. ఇప్పు డామహారామము ద్వీపపుదక్షిణతీరమందలి మతారా పురమునుండి బాటపై నలువదిరెండుమైళ్లదూరమునందున్నమఠము. ఇక్కాలమున ద్వీపమునందున్న పుణ్యక్షేత్రములలో నొకటిగ దర్శింపఁబడుచున్న తావు.

అట్లాదంపతులు బాలురగు నిర్వురసుతులతో రాహున యందుఁ గాలముఁ గడపుచున్నతఱి నొకనాఁటిరాత్రి విహారమహా దేవి నిదురనుండి మేల్కాంచి జెమునురాకొమరుఁడు పక్కపై ముడుఁచుకొని పరుండి నిదురింపుచుండ లేపి, "తండ్రీ! ఏలయిట్లు ముడుఁచుకొని పరుండెదవు. విశ్రాంతిగఁ జాఁపుకొని పరుండు"మని లేపెనఁట. బాలుఁడగు జెమును, "అమ్మా! ఎవ్వరికిని లోఁబడని సముద్ర మొకదెసను, అవ్వలితీరమున దమిళవైరులుగల్గిన మహా వేలిగంగ రెండవదెసను గల్గిన మనకు విశ్రాంతిగఁ గాలుసేతులు జాఁపుకొని పరుండ నెక్కడనున్నది. నన్నిట్లే యిప్పటికిఁ బండు కొననీ"మ్మని తిరుగ నట్లే నిదురించెనఁట.

అంతఁ గొంతవఱకి జెమునురాకొమరుఁడుత్తవయస్సురాఁగా, "దమిళులను దునుమాడ దాడివెడలుటకుఁ దన కనుమతి నీ"మ్మని తండ్రిని బ్రార్థింప కాకవణ్ణతిస్సామహాపతి, "కొంతకాల మాఁగు"మని వారించెనఁట. అట్లింకను గొంతకాల మాఁగి సైన్యబలమును బలపఱచుకొని రాజసుతుఁడు తిరుగఁ దండ్రి నదేకోర్కెతోఁ బ్రార్థింపఁ దండ్రి యియ్యకొనక "మోర్పు" మనెనఁట. జెమును విసిగి తనతల్లిచేతి యలంకారపుగాజుల రెండింటి నడిగిపుచ్చుకొని తండ్రికడ కరిగి తిరుగ ననుజ్ఞ నడుగఁ దండ్రి శాంతవచనములనే యుపదేశింప, విని "భూపతీ! యింక దేవరవా రొకటియు, నే నొకటియు, నీహస్తాలంకారములను

ధరింతుముగాక'' యనెనఁట. కాకవణ్ణతిస్సా తనసుతుని శూరత్వ మున కచ్చెరువంది సంగరమున కనుజ్ఞయిచ్చి తానును దాడివెడలి జెమునురాజసుతుని సైన్యాధిపతిగ నొనర్చి సంగర మొనర్చి దమ్మిళులను బరిమార్చి యనూరాధపుర మాక్రమించిరఁట. అది యాదిగ జెమునురాకొమరుఁడును బిదప జెమునుమహిపతీ యైనతఁనిగూడ దుతు (హస్తాభరణపుగాజు) జెమును యనంబడు చుండెనఁట. ఆతఁడు తండ్రికిఁ బిదప భూపతియై తనకుఁబిదపఁ దన కనిష్ఠసోదరుఁడగు తిస్సాకు సింహాసన మప్పగించెనఁట.

ఇంక నిటఁ దెల్పఁదగిన సంగతిని చెల్పి యవ్వల కరుగు దుముగాక. తిస్సామహారామస్తూప మొకచిన్ననదియొద్దున జల సమీపముననే నిర్మింపఁబడినది. దాని పైశిఖరము మొదలగు స్తూపాకారము క్రిందఁ గదలని శీతలజలమున స్పష్టముగఁ బ్రతి బింబించుచు నద్దమునందువలెఁ గాన్పించుచుండ నదియందు స్నానము లొనర్చువారిమున్క లాప్రతిబింబమును చిన్న యలల పాలుగఁ జేయుచుఁ గదపునే కాని రూపుమాపఁజాలవు. ఇది చూడఁదగిన చిత్రము.

అప్పటి సింహళదమ్మిళమహాసంగ్రామము కలుతరగ్రామ పరిసరముల నడిచెనని బలమగుప్రతీతి కలదు.

## చూడఁదగిన తావులు

ఆలూవిహారము- దంబుల్లానుండి ముప్పదిమైళ్ళదూరమం దున్న బౌద్ధభిక్షువులు వసించుమఠము. వలగంబభూపతి యఱవల దాడికి బెదరిపోయి యొకతఁటి నిట నివసింపనాయెనఁట. కొండపై గుహలున్నవి. క్రిందినుండి రెండు సోపానపంక్తులగుండా పై కెక్క నగును. పైనొకగుహయందుఁ జెక్కఁబడిన పెద్ద బుద్ధవిగ్రహము

కలదు. ఇట ననూరాధపురబోధివృక్షముయొక్క శాఖ యొకటి నాటి పెంచియున్నారు. కేండీపుర మిచటికిఁ బదునాలుమైళ్లందు నఁట. ఇచటిబౌద్ధు "లిట నే బౌద్ధభిక్షువులమహాసభ జరిగె" ననియు, "నందు బుద్ధబోధయగు త్రిపిటకములు వ్రాయఁబడె" ననియు ననుచున్నారు. అది క్రీ. వె. ఒకటవశతాబ్దకాల మనెదరు. ఇప్పుడాలూవిహారమున కరుగ సిలన్ గవర్నమెంటు రెయిల్వే నేరోగేజి బ్రాంచిలైను మటేలుస్టేషననుండి కడుసమీపమునఁ బరిసరము నందుఁ జేరనగును.

ఎల్లా- ఇది సౌందర్యములరాశియగు తావు (Beauty Spot). భండారువేలానుండి యేకున్నరమైళ్ళదూరమం దున్నది. ఇచటివిడిది బంగాళానుండి చూచిన నెదుటనే లోఁతగులోవయుఁ, బిదప మైళ్లతరఁబడి నరణ్యమును, నచ్చటచ్చటఁ గృతక సరస్సులును, పరిసరముల వరిపంటలును, అవ్వలఁ గనుచూపుమేర సముద్రమును గానవయ్యెడిని. సర్. ఎమర్సన్ టెన్నెంట్ అను దేశసంచారి దీనిని గాంచి వచించినట్లు ప్రపంచమున నిట్టి తావిదియే యనిపించును.

కలూదియాపోకనా- ఇదియొకజలతీర్థమగు సరస్సు. మహింతల్ పర్వతము దిగువను పరిసరముననే యున్నది. అట మెయిన్ రోడ్డునుండి యెడమవైపుగా రెండుఫర్లాంగులదూరమునం దున్నది. (మహింతల్ చూడుఁడు.) ఈప్రాంతములందే రాజగిరిలేనా (గుహామఠముకూడఁ) గలదు. (రాజగిరిలేనా చూడుఁడు.) ఊళ్ల నడుమగా మార్గముండి పోన్నాచుట్టు గండశిలలు, గొప్పగఁ బెరిగిన ఛాయావృక్షములు, మూసియుండ నిర్మలజలములు కదలిక లేక యద్దమునుబోలి పరిసరదృశ్యములు తనయందుఁ బ్రతిఫలించుచుండ నచ్చెరువుగొల్పెడిని. ప్రాంతముల మఠారామవిహారశిథిల

ములు మితిమీఱియున్నవి. అందుఁ బ్రధానమైన దొకశిలాకంద
రము. గుహనెత్తిపై నొకమఱ్ఱిచెట్టు ప్రబలి వేళ్లుక్రింద శిథిల
మొనర్చుచున్నవి. బాట కవ్వల రాజగిరిలేనామకము కలదు.
(రాజగిరిలేనా చూడుఁడు.)

కతారగామా సుబ్రహ్మణ్యక్షేత్రము- ఇది యరణ్యమధ్య
మున నొకపాటి చిన్నకొండపైనున్న శివకుమారుఁడగు కుమార
స్వామి దేవస్థానము. మాణిక్యగంగానదీతీరము. తిస్సామహా
రామమున కీశాన్యదిశగాఁ బదునొకండుమైళ్లదూరము. అది
మతారాపురమునుండి యఱువదిరెండుమైళ్లదూరము నం దున్నది.

మార్గమంతయు నడవియే గాన నడిచిగాని, కష్టముగా
నాటుబండిపై గాని పోనగుచున్నది. అట గ్రామములేదు. భక్తి
పారవశ్యమునఁ బ్రజలు దీనిని సింహళవారణాసి యనుచున్నారు.
కుమారస్వామికి దేవసేన యనియు, వల్లీదేవి యనియు నిర్వురు
భార్యలు. వల్లీదేవి వెడ్డా లేక యాఖోజాతివారి బాలిక యనియు,
వా రాదికాలపురక్కసులకు నరస్త్రీలయం దుద్భవించిన సంతతి
యనియు నచటివా రనెదరు. వెడ్డాలు సగర్వముగ వల్లీదేవి తమ
యాఁడుపడుచనియు, కుమారస్వామి తమయల్లుఁడనియుఁ బల్కెదరు.
ఇఁట నేటేట మార్గశిరశుద్ధషష్టి మొదలు పదునేను దినములు
గొప్ప యాత్ర జరుగును. తక్కినకాలములం దాతావు నిర్మాను
ష్యారణ్యమధ్య ప్రదేశమే. అత్తఱి హిందువులు, బౌద్ధులు,
మూరులు యాత్ర కరుదెంచి భక్తిపారవశ్యమునఁ బూజింతురు.
హిందూదేశమునుండి కూడ దక్షిణదేశపుటఱవ లరుదెంతురఁట.
రెండువేల సంవత్సరములుగ నీయాత్ర జరుగుచున్నదని పరిశీలకు
లనుచున్నారు.

క్రీ. ము. రెండువేలసంవత్సరములనాఁ డనూరాధపురము దమ్మిళుఁడగు ఎలరాభూపతిచే నాక్రమింపఁబడి కాకవణ్ణతిస్స నృపాలుఁడు రాహూన కరిగి యటఁ గాలముఁగడపుచుండ నగ్రి సుతుఁడగు జెమునురాకొమరుఁ డిట తపమొనర్చి యరులను జయించి యీదేవస్థానపుకట్టడములు కట్టించెనఁట. దేవస్థాన మది వఱకే యుండెనఁట. పరిశీలనలు క్రీ. ము. ౧౬౦ నాఁటిపనిగఁ బోల్పఁజేయుచున్నవఁట. యాత్రాకాలమున మాణిక్యగంగానదీ స్నాన మిట మహాఫలప్రద మందురు. అత్తఱి నెట గన్నను "హరోహర"యను హిందువులయఱపులును, "సాధుసాధు"అను బౌద్ధులకేకలును వినఁబడుచునే యుండెడిని. ఇచటి యడవిమృగములవలనిబాధ యాత్రికుల కుండదని యందురు. అప్పట్టుననంగడులగ్రామ మేర్పడుచుండును. సింహళదమ్మిళసంగ్రామ మాపరిసరములనే జరిగెనని కొంద ఱందురు.

కురునేగాలా- క్రీ. వె. ౧౪వశతాబ్దమున నొకప్పుడు రాజధానిగ నుండినది. ఇది కొలంబోనుండి యనూరాధపురమున కరుగు నినుపబాటపై నున్నతావు. పరిసరముల శీతాకోకచిలుక లధికము. అవి సామంతకూటమున శ్రీపాదమును దర్శించు నందురు. ఇకాలమున నిట నేనుఁగులనుబట్టు వేటఁలతావు (Elephant kraala)గ నున్నది. ఇటఁ జూడఁదగిన వేవియు లేవు. పశ్చిమముగ ననతి దూరమున సముద్రముకరిని నెగొంబోపట్టణ మున్నది. (నెగొంబో చూడుఁడు). ఇట నొక కృతకసాగరము కలదు.

కెలానియా లేక కలనిబౌద్ధదేవళము- కెలానియా గంగానదీతీరము. కొలంబోనగరమునుండి యాఱుమైళ్ళ సుప్రసిద్ధదేవస్థానము. ప్రతిపౌర్ణమినాఁటిరాత్రియు (అందు ముఖ్యముగ వైశాఖపౌర్ణమి) పెక్కండ్రు దర్శింతురు. దానికి పోయా అనిపేరు. అత్తఱి

నదియందు స్నానతీర్థము జరుగును. సింహళమున వెన్నెల యధిక తేజోవంతము గాన నీయాత్ర కడుంగడు వినోదకరమైయుండెడిని. బుద్ధభగవానుఁడు తనపాదముల నీ నదీజలములందుఁ గడిగి పవిత్ర మొనర్చెనని బౌద్ధు లందురు. ఉభయతీరములందు నీటి దనుకఁ బెరిగియున్న కొబ్బరి, వెదురు, పనసచెట్లయొక్కయాకులు గాలికిఁ గదలుచు వెలుతురునీడలను, నాకాశమున మేఘములు కదలుచు మాఱుచుండు నాకారములను నీటిలోఁజూపుచు నీటిరంగులను మాఱఁజేయుచుంట వింతగొల్పెడిని. దేవస్థానపుతావున బుద్ధభగవానుఁ డించుకసేపు నిలిచి రనియు, నది క్రీ. ము. ౬౨౩ నాఁడు వైశాఖపౌర్ణమియం దనియు, నర్ధరాత్రమునం దనియు బౌద్ధు లందురు.

కొలనీగంగా తీరమం దెచ్చటనో శ్రీమద్రామాయణ యుద్ధము నడిచినతావు కలదని పరిశీలకు లనుచున్నారు. సీతాదేవి సింహళమున రావణభూపతిచే నిర్బంధింపఁబడిన తావుగ సీతావాకను జూపెదరు. సింహళులను నల్లే యందురు.

గంపోలా (పురము)- పదునాల్గవ శతాబ్దమునం దొకప్పుడు రాజధానిగ నుండినది. కేండీనుండి దక్షిణముగా ౧౮ మైళ్ళు. ఇప్పుడు నాఁటి యానవాళ్ళేమియుఁ గానరాక రాజదంపతులు స్నాన మాచరించు ఘట్టమని యొకరేవునుఁ జూపుచున్నారు. అటఁగల యొకగండశిలపై సింహాకారము చెక్కింపఁబడియున్నది. దీని ప్రధానవీథి బజారుగ నున్నది. అందు మసీదులును, హిందూదేవాలయములును, గలవు. ఆబాటకొకప్రక్కగ కేండీనుండి హేటనున కరుగుబాటయు రెండవప్రక్కను నువారాకరుగు బాటయు నుంట నీ రెండుబాటలకు నడుమ బజారువీథి యున్నదని చెప్పవలయును.

గాలీ ఓడ రేవు- కొలంబోనగరమునుండి ౭౨ మైళ్లదూరము. క్రీ. వె. ౧౭వ శతాబ్దమున నిది సింహళపు రేవులలో నగ్రగణ్యమై యుండెను. కొలంబో హార్బరు నిర్మాణమునకుఁబిదప తగ్గిపోయినది. ఊరిలో పెక్కు గొప్ప భవనములు పాడుపడుచుంటయు, బాగుగ నున్నవి సరకులనిల్వ గోదాములక్రింద వాడఁబడుచుంటయు, కోట గోడలపై మొలచిన పచ్చిక చక్కని నడకమార్గముగ నేర్పడియుంటయుఁ గానవచ్చెడిని. ప్రాఁతయూరునందున్న పురాతనపు లైటు ప్రకాసు చూడఁదగినది. ఇప్పటి గాలీపట్టణము కోటకు వెలుపల పెరిగినది.

కొలంబోనుండి గాలీ కరుగుమార్గమునకు గాలీపేస్ అని పేరు. ఇది కొబ్బరితోఁట క్రిందనుండియే నడుచు నుద్యానవనమార్గముగ నున్నది. బాట కిరుప్రక్కలను పూఁదోఁటలనడుమ నిర్మింపఁబడిన సుఖనివాసభవనములు కలవు. అవి బాటసారులకు ధారకెడిని. వాటి కనుబంధముగ సముద్రస్నానపు టేర్పాటులు కలవు. ఈభవనములందు బెంటోటా, హిక్కడువా యనుపేరుగలవి మిక్కిలిసౌఖ్యకరము లనిపేరందినవి. మార్గమధ్యమున అంబలంగోడా యనఁబడుగ్రామముకడ సముద్రస్నానమున కావరణము గట్టి, చక్కని యేర్పాట్లు చేసియున్నారు. బైబిలుప్రాఁతనిబంధనగ్రంథమున గాలీ రేవును తార్షిష్ అనివాడియున్నారఁట. అరబ్బీలగ్రంథములందు కలా యనివాడిరఁట. గాలీయందుఁ గొబ్బరికాయలను మనుష్యుల ముఖములవలెను, పీచు జుత్తువలెను చెక్కెడుచేతిపని కలదు. చంద్రకాంతశిలను మెఱుఁగుపెట్టుట, తాఁబేటిబొరికెతో వింత వింత వస్తువులుచేయుట, సముద్రపుగుల్లచిప్పలతో వివిధాకారములను గుదిర్చి బొమ్మలుగఁజేయుట చేతిపనులుగ నున్నవి.

దంబుల్లా- సింహళభూపతియగు వలగంబును తనరాజధానిని దమిళులు లాక్రమింప నిత్తావునఁ గొండపై గుహఁ బాఱి పోయి తనసైన్యబలమును గూర్చుకొనుదనుకఁ దలదాఁచుకొనవలసి వచ్చె నఁట. అది క్రీ. ము. ౧౦౩ కాలమఁట. పిదప వారిని దఱిమి తనరాజధానిని దిరుగ నాక్రమించి యిచటిగుహను దమిళ్లాయని పేరిడి బౌద్ధదేవస్థానముగఁ బ్రతిష్ఠించెనఁట. పైకెక్కుటకు సోపానములు చెక్కించెనఁట. ఆపేరే నానాఁటికి దఁబుల్లా యైనదఁట. ఇది కొలంబోనుండి కేండీమీఁదుగా ౧౧౬ మైళ్లును, కేండీనుండి ౪౪ మైళ్లును, సిగిరియానుండి నైర్ఋతిదిశగాఁ బదిమైళ్లును గల యాత్రాస్థలముగ నున్నది. ఇందు బుద్ధభగవానునిజీవితమునందలి యాకారచిత్రము లనేకములు కలవు. నిర్వాణావస్థకయిన విగ్రహ మేఁబదియడుగుల పొడవుగ నున్నది. దుతుజెమునుఁడును, ఎలరా భూపతియు గదిసి కలహించువిగ్రహచిత్రము లచ్చెరువుగొల్పును. ప్రక్కతాతిగోడలందుఁ బురాతనసింహళభూపతులపరంపర విగ్రహములు కలవు. అందు వలగంబునివిగ్రహమును వరుసయం దర్హస్థానమీయఁబడినది.

తంగల్లా- ద్వీపపుదక్షిణభాగమున సముద్రతీరమం దున్నది. గాలీ రేవునుండి యేఁబదిమైళ్లు. మొసళ్ళచర్మముతోఁ జేయఁబడు కాలిజోళ్లు, సంచులు, పెట్టెలు మొదలగు చేతిపనులుగల తావు. లేసునూలుతో నల్లికల నిచ్చటియాఁడువాం డ్రనేకవిధములుగ జేయుదురు.

దియాతలవా- సమశీతోష్ణప్రదేశము. ఇది యీదేశమున పటాను లనఁబడు పర్వతపార్శ్వభాగములనున్న పచ్చికబయళ్ల యేటవాల్పుప్రదేశములందున్న తావు. ఆరోగ్యకరప్రదేశ మందురు. ఇది బ్రిటీషునావల్, మిలిటరీయుద్యోగులకు విశ్రాంతిస్థలముగను,

తరిబీయతు నిచ్చుతావుగను నున్నది. చెట్లుచేమలు చాల తక్కువ. పరిసరగిరుల శిఖరస్థలుల నెల్లెడలను దళతళమెఱయు స్ఫటికశిల లెండయందుఁ గాననగుచుండును. సింహళులకుఁబూర్వ మిది వెడ్డాలవేఁటలకు తావుగనుండెనఁట. ఆంగ్లేయులు దీనిని హేపీవేలీ యనెదరు. బోయరుయుద్ధమున బోయరుఖైదీలను, జర్మను యుద్ధ కాలమున జర్మనులను నిటనే యుంచిరి. సుందరమగు తావు.

నయన త్తివు లేక నాగ త్తివు– ద్వీపపుపశ్చిమతీరమున సము ద్రముదాఁటి యవ్వల (సమీపమందేయున్న) ద్వీపమునందున్న గ్రామము; యాత్రాస్థలము. కన్నకైయను పేరుగల దేవత దక్షిణఇండియా మధురప్రాంతముల నొకగ్రామమున వసించిన పేరంటాలు. ఆమెపే రిప్పుడు నాగభూషణి లేక నాగేశ్వరి యను చున్నారు. కొందఱు నాగమ్మాళ్ అందురు. జాఫ్నాద్వీపవాసులగు నఱవలుమాత్రమేగాక యఱవదేశమునుండికూడ యాత్రాకాలము లందు వేనవేలుగా వచ్చెదరఁట. గొప్పపూజల నందుచుండు ప్రసిద్ధదేవస్థానము.

నవాలాపిటియా– గంపోలాకు దక్షిణముగాఁ దొమ్మిదిమైళ్ల లోనున్న రెయిల్వేకోలనీ. ఒకపాటి వర్తకస్థానము. తేయాకుసీమ యందున్నది. ప్రాంతములందుఁ గొన్ని రబ్బరుఎస్టేటు లున్నవి. రబ్బరుధర పెరుగుకతనఁ గొన్ని తేయాకుతోఁటలనుఁ దీసివేసి యిటీవల రబ్బరుతోఁటలు నాటియున్నారు. ఆది నీసీమయంతయు కాఫీ తోఁటలమయమై యుండ దానికి తెగుళ్లుపట్టినతఱిఁ దీసి పాఱవేసి తేయాకుతోఁటలనాఁటి కబుర్లు చెప్పువా రనేకులు కలరు.

నెగొంబో– కొలంబోనగరమునుండి ౨౪ మైళ్ళు. సముద్ర మొకదెసను, సముద్రపుచెలకవేఱొకదెసను నుంట నీపుర మున్న యిసుకపట్టు చల్లనితావుగ నున్నది. డచ్చివారినాఁటిదుర్గము బాగు

గనే యున్నది. దానిని వారు క్రీ. వె. ౧౬౭౮ లో నిర్మించిరఁట. ఇట సింహళద్వీపమున కెల్లఁ బెద్దదిగఁ జెప్పఁబడిన వటవృక్షము (మఱ్ఱి) కలదు. కొలంబోనుండి మంచి మోటారుబాట కలదు.

పట్టిపోలాసమ్మిట్టన్నెల్- ఇటఁ బర్వతములపై పట్టిపోలా గ్రామము కలదు. అది సముద్రపు నీటిమట్టముపై నాలువేల యడుగుల యెత్తుకలదు. నానుఓయాసంధినుండి యాగ్నేయదిశగా నొకగంట పైనమున నిచటికిఁ జేరనగును.

సింహళమున వీచు వర్షవాయువులు రెండు. ఒకటి నైరృతి దిశనుండి వీచు సౌతు వెస్టు మాన్సూన్. రెండు ఈశాన్యదిశనుండి వీచు నార్తు ఈస్టు, మాన్సూన్. ఈ రెండు వర్షవాయుప్రదేశములు సంధింపఁబడుతావున నడుమ నడ్డముగ నీపర్వత ముంట నవి దీనిని దాఁటి యవ్వల కరుగఁజాలకున్నవి. ఇనుపదారి యివ్వలనుండి యవ్వలి కరుగ నీపర్వతమున నొకరంధ్రము చేయఁబడినది. అదియే యీపేరఁ బరఁగుచున్నది. దీని కొకదెస కొలంబో వైపనియు, రెండవదెస బాదుల్లా వైపనియు రెయిల్వేసందర్భములందు వాడుక నామము లిడఁబడియున్నవి.

ఈశాన్యపువర్షవాయువు వీచుచు రంధ్రముయొక్క బాదుల్లా వైపుకడను వర్షించుచున్నను నివ్వలి కొలంబోవైపుకడను నెండలు కాయుచుంటయు, నట్లే నైరృతివర్షవాయువు వీచుచు రంధ్రము యొక్క కొలంబోవైపుకడను వర్షించుచున్నను నవ్వలి బాదుల్లా వైపుకడను నెండలు కాయుచుంటయునిచ్చటి చిత్రము. ఇనుపదారి బండ్లు బాదుల్లావైపు బయటపడినతోడనే యాకాశ వాతావరణ మీప్రాంతములఁ గడుంగడు స్వచ్ఛమై యుంటఁ గడుదూర మందున్న బాదుల్లా రెయిల్ స్టేషనునందున్నవారికి స్పష్టముగాఁ గన్పించియు నెనుబది మినిట్లకాలము దనుక నటకుఁ జేరఁజాలకుండును.

ఈమార్గమంతయు ఉవాడొన్ను గుండా నడిచెడిని. ఈదృశ్యము కడువింతదై రంధ్రపుఁగడనుండిఁ గాన్పించుచుండును.

పెరడేనియా వనము (Peradenia Gardens)- ఇది లోకమంతటను బేరందిన కృత్రిమవనము. కేండీపురమునుండి మూఁడున్నరమైళ్ళదూరము. మహావేలి (మహావళి) గంగానదీతీరము నందే నాటఁబడినది. అచ్చటి సమశీతోష్ణస్థితియుఁ, బర్వతప్రాంత నదీతీరభూసారములును, బ్రిదేశౌన్నత్యమును, జలసమృద్ధియు, వేర్వేఱుజాతుల వింతవృక్షములను పలుదేశములనుండి రప్పించి నాటి యిటఁ బెంచిన యీకృత్రిమవనమునుఁ జక్కఁగ విస్తరింపఁ జేయుచున్నవి. వలమగునవి, సన్నమగునవి, గట్టివి,గుల్లవి, పొడవు గలవి, వన్నెలుగలవి యగు పలుజాతుల వెదురుపొదలును, లెక్క లేనిజాతులతాటిచెట్లును, ఆకులసౌందర్యములును, పూలసౌందర్యములును గలచెట్లు లెక్కకు మితిమీఱియున్న వనిన నతిశయోక్తి కానేరదు.

పరిసరముల రబ్బరు, తేయాకు, కొబ్బరితోఁటలు నిండి యున్నవి. ఈద్వీపమున పెద్దనదియగు మహావేలిగంగ పవిత్రము గఁ దలఁపఁబడుచు, రేవులు స్నానతీర్థములై యుంట గాననగును.

బట్టకాలోవా- ఇది యినుపదాట కగ్రస్థానము. ఇటఁగల సముద్రపుఁజెలకభూముల ననేకములుగ విభజించుచున్నది. ద్వీపపు తూర్పుతీరమునం దున్న పురము. సముద్రపుఁజెలక కవ్వల పాండిరుప్పొ అనంబడు గ్రామము కలదు. అది యిటీవల వంతెనకట్టి కల్పి యున్నారు. దీనినిఁ బంచపాండవులు దర్శించిరని యచటివారందురు.

బట్టికాలోవాయందు వెన్నెలరాత్రులలో సంగీతపు చేఁపల పాటధ్వని చెలకనుండి విన్పించుచుండును. త్రింకోమలి యిట కుత్తరముగా డెబ్బదిమైళ్ళదూరమునం దున్నది.

భండారువేలా- సమశీతోష్ణప్రదేశము. సముద్రపునీటిమట్ట ముపై నాల్గువేలయడుగులయెత్తు. నూవారాఎలియానుండి ౨౯ మైళ్ళదూరము. పటానులపై నున్న తావు పొడిగా భూమి, గాలి యుంట నారోగ్యకర ప్రదేశమని చెప్పఁబడియున్నది. స్వదేశస్థుల కెక్కువ యనుకూలమగుతా వందురు. ఈప్రాంతసీమల పైన్వృక్షములయడవులు మెండు. Mean temperature in Franheight thermometre ౬౮ డిగ్రీలుండెడిని. నూఆరాఎలియా యంత చలిప్రదేశముకాదు. పరిసరసీమయంతటను ఫలవృక్షముల తోఁటలు మెండుగాఁగలవు. మంచిబాట లధికముగాఁ గలవు. పర్వతపార్శ్వములును, గొండలచరియలును గడ్డిపట్టి యాకుపచ్చ రంగు పూసిన ట్లుండును. (పటాను లవియే) నానుఓయానదినుండి బాదుల్లా కరుగు నినుపబాటపై నున్నది.

బాదుల్లా (పురము)- బదులుఓయానదియొక్క (చంద్రవంకవంటి తిరుగుడునం దుంట నాపేరందినది) తేయాకుసీమయందున్న మూఁడుముఖ్యస్థానములలో నొకటిగఁ జెప్పఁబడినది. ఇనుపదారిపై కొలంబోనుండి ౧౪౧ మైళ్లును, నూవారాఎలియా నుండి ముప్పదియైదుమైళ్లును దూరము పరిసరములందుఁగల దున్హిందా జలపాతమున విద్యుచ్ఛక్తిని బుట్టించి తెచ్చి వీథులందు దీపకళికల నమర్చియున్నారు. తేయాకువర్తకము హాటన్, నూవారాఎలియాలతో పోటీకి నిల్వఁగల వర్తకస్థానమై యున్నది. బాదుల్లాసీమ తేయాకు మిగులరుచికరమును, పరిమళయుక్తము నైయుంట దీని నితరమగు తేయాకులతోఁ గల్పి యమ్ముదురని బలమగువాడుక గలదు. ధాన్యపుఁబంటయు నీసీమయందుఁ గలదు. ౧౮౧౭, ౧౮౧౮, ౧౮౧౯ నాఁటితిరుగుబాటువలన జనాభా తగ్గి యితర దేశముల కూలినాలులపై నాధారపడుట తప్పకున్నది.

బెరిండి లేక బెరండ కోవెల- ఇది శివదేవస్థానము. పశ్చాత్తాపమునుండి రక్షణ యని దీని కర్థమఁట. కోవెలపని పూర్తిగా కున్నను శివలింగము ప్రతిష్ఠింపఁబడియున్నది. అవిస్సవేలా రెయిలు స్టేషనునుండి మైలుదూరమున యతియన్తోఁటబాట కవ్వలనున్నది. క్రీ. వె. ౧౫౫౪ నుండి ౧౫౯౩ దనుక రాజ్యమేలిన రాజసింహుఁడను నృపాలుఁడు తనతండ్రి నిజంపి సింహాసన మెక్కెనఁట. పిదపఁ బశ్చాత్తాపముకల్గి బౌద్ధగురువుల నడుగ వారు చేసిన పాపమునకు ఫలిత మనుభవించుటయే కాని విడుదల లేదన వారి పైఁ గినిసి, వారిని శిక్షించి, హిందూమతగురువుల రావించి వారి నడుగ వారు శివలింగప్రతిష్ఠను దెల్పిరఁట. ఆయనయు సమ్మతించి య ట్లొనర్చెనఁట. దేవాలయపుఁబని పూర్తికాలేదు.

మన్నారుద్వీపము, మన్నారు(పురము), తలమన్నారు (రైల్వే అగ్రము)- ఇది సింహళద్వీపమున కుత్తరముననున్నది. భరతదేశపు సౌతిండియన్ రైల్వే ధనుష్కోటి (పాంబన్‌ద్వీపపు తూర్పుకొన) కడ ప్రయాణికులను దింపువారఁట. ఓడ నెక్కి ౨౨ మైళ్ళు (పాక్సు జలసంధి) సముద్రమును దాఁటి తలమన్నారున నోడదిగి (సింహళమునకుఁ జేరి యని భావము) సిలన్ గవర్నమెంటు రైల్వే నెక్కుదురు. తలమన్నా రీమన్నారుద్వీపకల్పములోనిదే. ఈద్వీప మాగ్నేయదిశనుండి వాయువ్యదిశ కిఱువదిరెండుమైళ్ల పొడవు. దీనియందాగ్నేయపుఁగడను మన్నారుపురమును, వాయవ్యపుఁగడను తలమన్నారును గలవు. మన్నారుద్వీపమంతయుఁ దుప్పలు, డొంకలు, బలిసియున్న ప్రదేశము. ఇసుకబయలు, నడుమనల్లతాడి, మంకీ బ్రెడ్ ఫ్రూటనంబడుచెట్లు గాననగును. ఈవింతచెట్లు ముప్పదియడుగులయెత్తునకుఁ బెరిగి చుట్టుకొలత యఱువది యడుగులవఱకుంట వింతగాఁ దోఁచెడిని. ఇంక నల్లతాడిచెట్లు భరతదేశపుతాడిచెట్లను

బోలి పొడవుగా నుండక చెట్టుకట్టురంగు కడునల్లగా నుండెడిని. తెల్లతుమ్మ లేక గొడుగుతుమ్మచెట్లు ద్వీపమంతటను గలవు. ప్రజలు చేఁపలు పట్టువాండ్రు. మన్నారునందుఁ గొంద ఱితరజాతులవారును గలరు. సముద్రతీరమునం దొక్కటియు, మధ్యభాగమునందొక్కటియు, రోమన్కాతలిక్కు దేవస్థానము లున్నవి. అవివారియాత్రా స్థలములు. ప్రజలు రోమన్కాతలిక్కు క్రైస్తవమతస్థులే.

మిన్నేరియా దేవస్థానము- మహాసేననృపాలుని విగ్రహము లిందుఁ బూజింపఁబడుచున్నవి. ఈయన క్రీ. వె. ౨౭౭-౩౦౪ లో సింహళరాజ్య మేలినవాఁడు. రాచబాటనుండి రెండుఫర్లాంగుల దూరమున వరిపొలములనడుమ నొక మెరకప్రదేశమున నిర్మింపఁ బడినది. దాని మాహాత్మ్యమును గాంచి రెండవరాజసింహనృపాలుఁ డొకక త్తి నీదేవస్థానమునకు బహుమాన మొసంగెనని చూపుచున్నారు. న్యాయస్థానపుకక్షిదారులిట నబద్ధమాడ వెఱతురఁట. న్యాయాధిపతు లటకు వాదిప్రతివాదులతో నరుదెంచి ప్రమాణ వాక్యములపైఁ దీర్పులుజెప్పు నాచారము కలదందురు.

మిన్నేరియా వేవా (జలస్తంభనస్థానము)- సింహళులపాలన నాఁటి జలస్తంభనపు కట్టడము (Dam). సుందరతరదృశ్యము. కట్టించినది మహాసేననృపాలుఁడు- కొలంబోనుండి రగమాసంధి, పోల్గాహవేలాసంధి, మాహెూసంధి, గాలోయాసంధి గడచి బట్టికాలోవా కరుగు నినుపబాటపై మిన్నేరియాస్టేషనుకడ నరణ్యమందు ముప్పదిమైళ్లు చుట్టుకొలతగల్గి నీలిమందు నీటగల్పినట్లూదారంగుజలములు గల మిన్నేరియాసరస్సు కలదు. ఇఱువది వేల మిలియనుల గాలనుల జలము లిందు బంధింపఁబడినవి. దీని డాము (Dam) ౬౨౦౦ అడుగుల పొడవు. చాల గట్టిపని. ఒక్కొక తావున నలువది, యేఁబది యడుగులు పునాదినుండి కట్టఁబడిపదు

నాలుశతాబ్దములు గడచినను జెక్కుచెదరక నేఁటికిని నట్లే నిలిచి యున్నది. క్రీ. వె. మూఁడవ శతాబ్దమున నిర్మింపఁబడిన రెండు స్థూపములగుండా వరిపొలములకు నీరిచ్చుచున్నది. రేవు లన్నియు నిసుకరేవులే. పిట్టలు, పటాలవు వరుసలనుబోలి బారులుతీర్చి తిరుగుచు నీటిపైవ్రాలుచుఁ జేఁపలను దినుచుఁ గాన్పించును. చెఱువు నందుఁ గొన్ని చిన్నవి, కొన్ని యించుకపెద్దవి ద్వీపము లేర్పడియున్నవి. చెఱువునందు మొసళ్లు కలవందురు.

రెండవస్థూపముపై డామ్పైనే వేడాఇన్నామాలిగావా యనంబడు దేవస్థానమును, అందు మహాసేననృపతియొక్కయు, నాయన రాజ్ఞియొక్కయు, మంత్రియొక్కయు, విగ్రహములు కలవు. వాటి నెవ్వరైనను సమీపింప వెఱతురఁట. వాటియెదుట ప్రమాణము చేసి యనృతమాడ భయపడుదురు. కావున న్యాయాధిపతియు నట కరుదెంచి నిజము చెప్పించి తీర్పుల నొసంగు నాచారము కలదందురు.

మౌంటులెవీనావినోదగృహము- కొలంబోనుండి దక్షిణముగా నేడుమైళ్లదూరమునందు సముద్రతీరమునసుందరమగుతావున నిర్మింపఁబడినది. ఆదిని క్రీ. వె. ౧౮౨౪ లో సిలన్‌గవర్నరుగ నుండిన Sir Edward Barnes గారు గవర్నరుల కిది నివాస గృహముగ నిర్మింప నారంభించి యంగీకారము నొసంగ బ్రిటీషు పార్లమెంటును గోరగా వారీయకొనక నిరాకరించిరఁట. అది యట్లు వదలివేయ బడియు నించుమించుగఁ బూర్తియై వినోద గృహముగ నుండెడిదఁట. ఇప్పు డందు గ్రాండుహోటేలు కలదు. గవర్నరుగారిడినపేరే వాడఁబడుచు సముద్రతీరమున స్నానపు ...ట్లును, హోటేలునందొక మెరైను ఎక్వేరియమును నేర్ప ...కున్నవి. అందు సముద్రపుజంతువులను బెంచుచున్నారు.

కొలంబోనుండి యిట కరుగుమార్గముననేయున్న జూలోజికల్ గార్డెన్సు కలవు. అందు మృగములే గాక చక్కనియుద్యానవనము గూడ నిర్మింపఁబడినది. ఇచటి ఛాయావృక్షములు వర్ణనాతీతములు.

యాపహువా-ఒకప్పుడు రాజధానియైన పురము. ౧౨౭౦ లేక 30 నాఁడు దమ్మిళుల (యుఅవల) దాడి యధికమై కళింగ విజయబాహుఁడు లేక మాఘుఁడు అను దమ్మిళశూరుఁడు పొలోన్నరువను బట్టుకొన శుభసేనాపతి యనంబడు సింహళ సామంతుఁడొకఁడు రాజధానినివీడి యిట నొక గిరిదుర్గము కట్టుకొని యుండెనఁట. క్రీ. వె. ౧౨౭౧-౧౨౮౩ లో రాజ్యమేలిన యొక భువనైకబాహునృపాలుఁడు తన రాజధాని నిటకు మార్చి బుద్ధభగవానునిదంతమునుగూడ నిటకుఁ గొంపోయె నని చెప్పఁబడినది. కొంతకాలముపిదప నీపురము బాగుగనుండెను గాని పోర్చుగీసువారు దీనినిఁ బాడుచేసిరఁట. ఇటీవలఁ ద్రవ్వి బయలు దేరఁదీయఁబడిన కిటికీ కొలంబో మ్యూజియమునందున్నది. ఒక సోపానపంక్తి త్రవ్వి బయలుదేఱఁదీసిరి. యాపహువామాహో సంధికిఁ గొంతదూరమునందున్నది. రాజధాని యాపహువానుండి కురునెగాలాకును, అటనుండి (కొలంబో యొద్దనున్న) కోటీకిని, అటనుండి కేండీకిని, (అనఁగా రెండవసారి) మార్పఁబడి ౧౮౧౫ లో బ్రిటీషువారి వశమైనది.

రత్నపురము- జెమ్‌లాండు అనంబడు ప్రదేశమునఁ బ్రధాన స్థలము. కొలంబోనుండి ౫౬ మైళ్ళు. భూమినుండి రత్నములు త్రవ్వి తీసి ముఖములుకోసి సానపట్టుపని కొంతబాగుగనే జరుగుచున్నది. ఏఁటేట కేండీయందు పేరేహారోత్సవము జరుగుకాలమున రత్న పురమున రత్నములసంత జరిగెడిని. భూములందీమండలమంతయు

కెంపులు, పచ్చలు, నీలములు, చంద్రికాంతమణులు, వైదూర్యములు, మరకతములు దొరకెడిని.

ఈసీమయందు పోకతోఁట లధికము. శ్రీతాళ మనంబడు పెద్దజాతితాడిచెట్లు కలవు. వాటియాకులు నాల్గంగుళముల వెడలు పుండెడిని. వాటిపైఁ దొల్లింట గంటములతో గ్రంథములను లిఖించు చుండెడివారు. దానిని తాళీపాట్ అనుచున్నారు. పోకచెట్ల నీసీమ వారు రామబాణ మనెదరు. ఈసీమయందు సింహళు లధికము. ఇది సామంతకూటపర్వతపాదముననే యున్న పట్టణము. పరిసరసీమ లందు తేయాకుతోఁటలనుండి చూచిన కొలంబో లైట్ హౌస్ దీపము కాననగును. దూర మేఁబదిమైళ్ళున్నను వాతావరణపరిశుభ్రత దీనికిఁ గారణమందురు.

రాజగిరిలేనా- బౌద్ధసన్యాసులమఠము. మహింతల్ పర్వత పాదముననే కలూదియాపోక్నా పరిసరముల నున్నది. అనూరాధపురమునుండి యెన్మిదిమైళ్ళ రెండుఫర్లాంగులదూరము. భూమినుండి నూఱడుగు లెత్తుగలప్రదేశమునందున్న బౌద్ధవిహారము. ఎక్కుటకు శిలాసోపానములు గలవు. దానిని దొలచి వరండా, నీటికాలువ, జలనిలయాదులు నేర్పఱచియున్నారు. అరణ్యదృశ్య మటనుండి యద్భుతముగా కాననగును. (కలూదియాపోకనా, మహింతల్ చూ.)

విజితపురము- విజయుని యనుచరవీరుఁడగు విజితుఁడు సైన్యాధిపతియై యుండెను. ఈగ్రామముకడ జయమంది తనపేరున నిది వెలయఁజేసెనఁట. కావున క్రీ. పూ. ఆఱవశతాబ్దమునాఁటి నుండియు నిది యున్న దనిపించెడిని. కేకిరావనుండి యాఱుమైళ్ల దూరము. క్రీ. పూ. రెండవశతాబ్దమున దుతుజమునునృపతి దీని నటవలనుండి కైకొనెనని చెప్పఁబడినది. మహావంశమున నీయుద్ధ మునుగూర్చి వ్రాయుచు భూపతి భద్రగజమగు కందులమునకు

గాయము లగుట భూపతియే మందిడి కట్టుఁగట్టుట, అది యొక బండిచక్రమును బట్టుకొని పురములోని దమ్మిళులను దునుమాడుట చక్కఁగ వర్ణింపఁబడినది. ఇచటగల స్తూపమున బుద్ధశల్య మొకటి కలదందురు. విజితపురమున కినుపదారిపైఁ బోవనగును.

వేలీగామా- సముద్రస్నానముల తావు. పవిత్రస్నానతీర్థము కాదు. గాలీ రేవునుండి పదునేడు మైళ్లదూరము. సముద్రమునీ రిట లోఁతు లేదు. నీటమున్గియున్న ఱాళ్ళు లేవు. కాన స్నానమపాయ కరము కానేరదు. ఇసుకతావు. లోనికిఁ జాలదూర మరిగినను భయ ముండదు. అఱమైలుదూరమున నొక ఱాతివిగ్రహము కలదు. అది కుష్ఠరోగియైన సింహళభూపతి దందురు.

సిగిరియా-దీనికి సింహగిరియనియో, సింహశిలాతలమనియో యర్థమఁట. కొలంబోనుండి ౧౭౬ మైళ్ళును, కేండీనుండి ౫౪ మైళ్ళును, అనూరాధపురమునుండి యేఁబదిమైళ్ళును, మహింతల్ నుండి యేఁబదిమైళ్ళును దూరమున నున్న యాత్రాస్థానము. సింహళుఁడగు ధాతుసేన నృపాలుఁనిసుతుఁడు కాశ్యపుఁ డను (కాశియప్ప) భూపతి చాల క్రూరుఁ డట. క్రీ. వె. ४౬3, ४౭౯ లో ఈతని పాలనకాలము. ఈతఁడు కూ్రరుఁ డనియు శతు్రవులపొ్ర త్సాహము మేరకు తండి్రనిఁ జంపించెననియుఁ జెప్పఁబడినది. ఈతని సవతియన్నగారు ముగల్లాన్ (చక్రవర్తి) తప్పించుకొని దక్షిణ ఇండియాకుఁ బాఱిపోయి పదునెన్మిది వత్సరములు ప్రవాసముఁ గడిపి గొప్పసైన్యమును గూర్చుకొని దాడివెడలివచ్చెనఁట. కాశియప్ప సింహాసన మెక్కి తనసహజకూ్రరత్వమునఁ బ్రజల కొత్తిడిగల్గించుచుండ దేశమంతటఁదిరుగుబాటుగల్గి యతఁడు తప్పించుకొని పాఱిపోయి సిగిరియాగుహలు నిర్మించుకొని యట వసించుచుండెనఁట. ఇవి కొండపై నున్న గుహలు.

కాశియప్ప అన్నగారిరాక నెఱింగి ఆత్మహత్య గావించు కొనెనఁట. పూడువఁబడిపోయిన సోపానముల నార్కియాలోజికల్ డిపార్టుమెంటువారు బయలుదేఱఁదీయించి పోయినతావుల నినుప నిచ్చెనల నమర్చిరి. ఇందలి భగ్నచిత్రములపనితనము కొలంబో మ్యూజియమునం దుంపఁబడి యున్నది. ఇటఁ దేనెటీఁగ లధికము గాన జాగ్రతగా నెక్కవలసియుండును. ఇం దాయన కూర్చుండు హాలు గుహాయు, సింహాసనమును త్రవ్వి బయలుపఱుపఁ బడి యున్నవి. అందు గొప్ప పనితనము కాన నయ్యెడిని. వర్షపునీరు నిల్వచేసికొను రిజర్వాయరులు తొలువఁబడినవే. దీని నిర్మాణము క్రీ. వె. ४८८ లో నని చెప్పుచున్నారు.

ఒక పరిశీలకుఁడు దీనిని "It is an immense cylindrical rock raising 400 ft. above the forest and has a flat top of an acre in extent. Sheer precipices surround it on three sides and it can be climbed but with defficulty on its eastern side" అని వ్రాసి యున్నాఁడు.

సీతాఎలియా- హిందువులకుఁ బవిత్రసీమ. ఎలియా యన ప్రదేశమని యర్థము. ఆంగ్లేయు లీప్రాంతమునకుElk downs అని పేరిడియున్నారు. ఇదియంతయు నల్లనిభూమి. ఆంజనేయుఁ డిటఁ గల సర్వమును గాల్చినకతన మాడి నల్లవడినదని యచటివా రనెదరు. దీనికడను రావణభూపతి భరతదేశపు నాసికాత్ర్యంబక మున కవ్వలితీరమందున్న పంచవటిపర్ణశాలనుండి సీతాదేవిని జెఱ పట్టి నిర్బంధించి యుంచిన తావని చెప్పఁబడుచోట నొక చిన్న యింట సీతాదేవి దేవస్థాన మేర్పాటుచేయఁబడి యొక తెల్లజెండా యొకగెడకుఁ గట్టఁబడి యున్నది. ఇది యిట యాత్రాస్థలమై

యున్నది. ఆప్రక్కనే దొరలుచుఁ బాఱుచుండు చిన్న జలప్రవాహము శీతలోదకములుగల్గి సీతావాక యనఁబడుచు స్నానతీర్థమై యున్నది. అది యామె కక్కాలమున దాహోపాదక మందురు. ఈతావు నూవారాఎలియాపీఠభూమికి దిగువనే చీనాతేయాకు తోఁట పరిసరములనే యున్నది. కొందఱు పరిశీలకుల మనువారు సింహళము లంకారాజ్యమే కాదనువారును, ఇంకను కొందఱు రామాయణకథనే యబద్ధ మనువారును గలరని యెల్ల రెఱింగినదే. అట్టివా రీస్థలమును నిరసింతురేమో కాని నేఁటికి నిది దేవస్థానముగ యాత్రాస్థలమై యున్నది.

హంబన్తోట-గాలీనుండి తూర్పుగా నిరువదిమైళ్ల దూరమున నున్న యుప్పుగల్లీల తావు. ఇది సింహళద్వీపమున Driest climate గల్గినతావని పేరొందినది.

హక్ గల్లా- ఇట నొకకృత్రిమవృక్షవన మున్నది. దీని నాంగ్లమున బొటానికల్ గార్డెన్సు అనియెదరు. వేర్వేఱుజాతుల తరుగుల్మలతాదులను జేర్చి నాటి పెంచుచున్నారు. వృక్షశాస్త్రజ్ఞుల యాధికారముక్రిందనున్న తోఁట. హక్ గల్లా యనంబడు గొప్పగండశిల ప్రక్కనుంట నాపేరఁ బరఁగుచున్నది. ఏనుఁగుకాలును బోలిన శిఖరమని యీమాట కర్థము. ఇందు Ferns, Tropical Plants, Semi Tropical Plants, Lilies of Various sorts మొదలగునవి చక్కఁగఁ బెరిఁగియున్నవి. ఇందలి జలనిలయములందుఁ బెంచఁబడుతామరజాతులు, కలువజాతులు పెక్కులు గలవు. ఇం దొక్కతావున కెక్కి-చూచితిమేని పటానులగుండా ఉవాకొండలదనుకఁ గాన్పించుదృశ్య మద్భుతము గొల్పెడిని. క్రీ. వె. ౧౮౬౦ ప్రాంతముల చలిదేశపు చెట్టుచేమలను, వేఁడిప్రదేశముల కలవాటుపడి బ్రతుకున ట్లొనర్చు పరిశీలనలను జరపు

తావుగనుండి యిపు డిట్లు రెండుపనులనుగూడఁ జేయుచున్నది. తోఁటకుఁ బైగానున్న హాక్‌గల్లాపర్వతశిఖరముయొక్క యెత్తు ౧౬౦౦ అడుగు లుండును. ఎదుటనే ఉవాడౌన్సు కలవు.

హేటన్ పురము- తేయాకుసీమయందు మూఁడు ముఖ్య వర్తకస్థానములలో నొకటి. ఇనుపదారిపైననే యున్నది. సముద్రపు నీటిమట్టముపై ౪౦౦౦ అడుగులయెత్తు. బజారు సుందరముగఁ గట్టఁబడకపోయినను గొప్పయంగడులు కలవు. వాటియందన్ని దేశములసరకులుదొరకెడిని. తేయాకువర్తకమధికముగనున్న తావు.



# ఆంధ్రవిజ్ఞాన కార్యస్థానమున వెలకు దొరకు గ్రంథములు.

## ఆంధ్రవిజ్ఞానము (Telugu Encyclopaedia)

వరిసాదభూపాల విరచితము.

1, 2, 3, 4 సంపుటములు. సంపుటము 1కిరు. 8—0—0 లు.
మార్చి నెల ఆఖరు వఱకు మాత్రమే. పిమ్మట నెలలు హెచ్చును.

ఆంధ్రవిజ్ఞానానుబంధములు.

1. సాంఖ్యాదర్శము వెల. 0—8—0.

మున్నూట నెనుబది నాల్గు సంఖ్యలవఱకు వ్రాయఁబడినది.

2. బర్మాదేశ చరిత్రము వెల. 0—8—0.

3. సింహళద్వీప చరిత్రము వెల. 0—8—0.

4. ఆంధ్ర లోకోక్తిముక్తావళి వెల. 0—12—0.

పెక్కు సామెతల కుదాహరణములను జూపు రసవంతమైన పద్యములు గలది. కవిరాజ నేమాన సూర్యప్రకాశకవి విరచితము.
నాల్గాశ్వాసముల పద్యకావ్యము. మృదుమధురశైలితో సర్వాంగసుందరమై యొప్పుచున్నది.
వి. పి. ఛార్జీలు ప్రత్యేకము.

వలయువారు ఈక్రింది చిరునామాకు వ్రాయుఁడు.

ఆంధ్రవిజ్ఞాన కార్యస్థానము,
దే వి డి,
సరసన్నపేట పోస్టు, విశాఖపట్నం జిల్లా.